


ఆహా! నూట్రిన్ స్పెషల్!

nutrine

FOR YOUR SWEET PLEASURE

మంచి మంచి నాణ్యాల రుచులలో!




ఒక్కొక్క మిఠాయియందు
ఫలరసపూరితవిందు!

న్యూట్రిన్ కన్ఫెక్షనరి కంపెనీ లిమిటెడ్, పలమనేర్ రోడ్డు, చిత్తూరు, ఆం.ప్ర.

NCM.58.75.TEL

# సన్‌సార్

ఇది
కుటుంబమునకు
స్నానపు సబ్బు

మైసూర్
స్యాండల్ సోప్
తయారుచేయువారినుంచి







100 గ్రా. స్నానపు సబ్బు బిళ్ళకు 95 పైసలు మాత్రం పన్నులు ప్రత్యేకం

MCA/SAN/1

తయారుచేయువారు: గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు. సోల్ సెల్లింగ్ ఏజెంట్లు: మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్



# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938-1972]
శుక్రవారం : 12-3-'76
రాక్షసనామ సం. ఫాల్గుణ శు. ఏకాదశి
**సంపుటము : 69 సంచిక : 27**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సరచందా – రు. 33-80
ఆరుమాసాల చందా – రు. 16-90
విడి ప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక





# చరక సంహిత

దేశెట్టి కేశవరావ్

పెద్దకథ ప్రారంభం

"ఒరేయ్, కుంకా!" తాగుతున్న కాఫీ కప్పుని సాసరుమీద వుంచుతూ అన్నాడు జయరాం. "వింటున్నావట్రా వెర్రినాగన్నా! దేశంలోని స్వామిభక్తి పరాయణు లందరూ సంఘటితమై ఈ జయరాం గాడికి సహాయం చేసే తరుణం ఆసన్నమైందిరా!"

"నాకేం అర్థంకాలా!" అన్నాడు వాసుదేవరావు, టీ ఇంకా సిప్పైనా మిగిలిపోయిందేమోనని కప్పులోనికి చూస్తూ.

పై సంభాషణ జరిగిన ప్రదేశం "నగర ఢంకా" పత్రికా కార్యాలయం, దూరం నించి చూస్తే ఆ పత్రికా కార్యాలయం తాలూకు భవనం స్టంటు సినిమాల్లో సి. ఐ. డి. దాక్కునే ప్రదేశాన్ని జ్ఞప్తికి తెస్తుంది. ఆ భవనం ముందు ఎర్రని తాపుర పొదల్లాగా కనిపించేది బోగన్‌విల్లా. పెరిగిపోతున్న గోపురం లాగా కనిపించేది గేటుపక్కనే గల గోడలోని భాగం. విచిత్రంగా వంచబడిన కడ్డీల లాగా కనిపించేది గేటు. భవనానికి పై భాగాన బోర్డు లాగా కనిపించేది బోర్డు. ఆ బోర్డు మీద రాసివున్న "నగర ఢంకా" అనే అక్షరాలు మీకు సరిగ్గా కనిపిస్తే మీ దృష్టి ఖచ్చితంగా వుందని చెప్పవచ్చు. జయరాం అనబడే వ్యక్తి ఆ పత్రికకి అధిపతి, సంపాదకుడూ.

"అర్థం కాలేదా?" అని ప్రశ్నించాడు జయరాం. "అయితే విను! ఈ మధ్య మా పత్రిక కొనుగోళ్ళు ఆందోళన కలిగిస్తున్నాయి: ఏదో ఒక విధంగా కొనుగోళ్ళని పెంచితే తప్ప నష్టం రావచ్చుననే భావన అధికార వర్గాల్లో వుంది. వింటున్నావా?"

"ఊఁ! చెప్పు!" అన్నాడు వాసుదేవరావు. పోయిన పక్షం అమ్ముడు కాక మిగిలిపోయి గుట్టలుగా కట్టిపడేసిన పాత పత్రికల మీద వుంది అతని చూపు.

"దీనికో కొత్త తరుణోపాయం వుంది! పాఠకులకి ఉత్సాహాన్ని కలిగించే కొత్త శీర్షికని ఒకదాన్ని ప్రవేశపెట్టాలి!"

"మంచిదే! ఈ వూహ నీ కెప్పుడో రావలసింది. ఈ పాటికి కాస్త పుంజుకొనే వాడిని!" అన్నాడు వాసుదేవరావు.

"సరే! ఇప్పుడే కళ్ళు కర్ణిగా విని మా విలేఖరి మోసుకొచ్చిన తాజా వార్త ఏమిటో తెలుసా?"

ఆశ్చర్యంగా కనుబొమ్మలు పైకెత్తాడు వాసుదేవరావు. "మా విలేఖరెవడోయ్" అని ప్రశ్నించాడు.

నిర్లక్ష్యంగా చేతులూపాడు జయరాం. "మధ్యలో అడ్డు తగలకు! మా విలేఖరి అంటే నేనేననుకో. ఇంతకీ ఈ వార్త ఏమిటని అడగవేం? కెప్టెన్ మోహనరావుగారు ఒక వైద్య గ్రంథాన్ని రాస్తున్నాడు. ఆ గ్రంథాన్ని ధారావాహికంగా మన పత్రికలో ప్రచురింపబోతున్నాం!"

"ఇది నీకు కలిగిన వూహా? లేక ఆయనకి పుట్టిన బుద్ధా?"

"అక్కడే వుందిరా కుంకా! వ్యవహారమంతా. ఇది నీ చేతులమీదుగా జరగవలసిన పని."

"అంటే?"

"మాపత్రికకి విలేఖరి అన్నట్టుగా నీవు వెళ్ళి ఆయనని ఇంటర్వ్యూ చెయ్యి ఆయనతో పరిచయాన్ని మనపత్రికలో ప్రకటిస్తామని చెప్పు. ఇంకా ఏమేమిటో చెప్పు. ఈవిషయం మాత్రం మర్చిపోకు: పొడివేసి ఆయనని పులకింప చెయ్యాలి. అంటే ఒకరస్సావేసి రంజింపచెయ్యాలి. 'డబుల్‌కా' వేసి దయ సంపాదించాలి. నీమాటల ఫలితంగా ఆయన తనపుస్తకాన్ని మనకి దయచెయ్యాలి. మన పంట పండాలి. అర్ధమైందిరా నాగన్నా?"

"చక్కగా అర్ధమైంది! నీవూహకూడా చాలా బావుంది. డాక్టర్ మోహన్‌రావుగారికి యీవూళ్ళో మంచి పేరుంది. అంచేత ఆయన రాసిన పుస్తకాన్ని నువ్వు సీరియల్‌గా నీపత్రికలో వేసుకున్నావంటే నువ్వన్నట్టు నీపంట పండటం ఖాయం. అయితే నేను మాత్రం యీపని చెయ్యడం కల్ల!" అన్నాడు ఖండితంగా వాసు.

జయరాం మొహం మీద బాధలాంటి భావం ద్యోతకమయింది. "కష్టాల్లోవున్న నేస్తం సహాయం అడుగుతున్నాడని నువ్విలా అమానుషంగా మాట్లాడ్డం న్యాయమా?" అన్నాడు.

"అదికాదు నావుద్దేశ్యం! డాక్టరుకి యిష్టం లేకపోతే ఏవస్తువునయినా ఆయన దగ్గర్నించి సంపాయించలేవు. కాబట్టి యిలాంటి దురాశలు వదులుకోమని నా సలహా!"

జయరాం లేచి నిలబడ్డాడు. "పొరబాటు పడుతున్నావ్. కఠోపనిషత్తులో గీతాకారు డేమన్నాడు? మానవుడు తలచుకుంటే సాధించలేనిది లేదనేగా! సాధించ దలచుకున్నది సాధించి తీర్తాను. మర్యాదగా అతడిచ్చాడా సరే! లేకుంటే దాన్ని దొంగిలించి అయినా సాధిస్తాను!" కర్తవ్యదీక్షా భావం వ్యక్తంకాగా ఘంటాపథంగా మాట్లాడాడు.

"దొంగిలించావనే అనుకుందాం! దాన్ని నీ పత్రికలో ఎలా ప్రచురిస్తావు? పోలీసులకి అప్పజెప్పి నిన్ను చీకటికొట్లో తోయించగలడు, మోహన్రావ్. జాగ్రత్త!" అన్నాడు వాసు.

చేస్తున్నపని ఎంత చెడ్డదయినా, దానిలోనూ సాధ్యాసాధ్యాలు గమనించాలనేతత్వం అతనిది.

"నా వుపాయాలు నాకున్నాయ్!" రహస్యమైన పద్ధతులేవో కనిపెట్టేసినట్టు, మార్మికంగా మాట్లాడాడు జయరాం "ఇంతకీ నువ్వు నాకు సహాయం చేస్తావా? చెయ్యవా?" అని ఖండితంగా అడిగేశాడు.

"ఛస్తే యీపని చెయ్యను! ఇదిగాని తెలిసిందంటే వసుంధర యీ జన్మలో నా మొహం చూడదు!" అని అదే ఖండితమైన ధోరణిలో చెప్పాడు వాసు.

జయరాం కాసేపు మౌనం వహించాడు. చివరికి, ఆలోచన రావడానికన్నట్టు గదిలో అటూ, యిటూ పచారు మొదలెట్టాడు ఒకచోట అకస్మాత్తుగా నిలబడి, "ఒరేయ్, కుంకా! నిజం చెప్పరా! నువ్వు వసుంధరని ప్రేమిస్తున్నావా?" అనడిగాడు, తర్జని అతడివంక చూపుతూ.

వాసు జవాబులో తడబాటేమీ లేదు "ఇది మోహన్రావు అడగవలసిన ప్రశ్న! అతనైతే నన్నెప్పుడూ అడగలేదనుకో ..."

అన్నాడు.

"అయితే యింకేం ? నాకు సాయం జెయ్యమని అడగడం కేవలం నా స్వార్ధానికే అనుకోకు. ఎలాగైనా నీకు మేలు చెయ్యా లనే నా తాపత్రయం. నే చెప్పినట్టు చేస్తేవా, నువ్వు వసుంధరని పెళ్ళాడడానికి ఏ అడ్డంకీ వుండదు!" అన్నాడు జయరాం.

"నీ కల్లిబొల్లి కబుర్లు విని మోస పోయేంతటి అమాయకుణ్ణి కాను గానీ ..."

జయరాం నిర్వికారంగా చేతులు గాలిలో విసిరాడు. "పోనీ, పోనీ! ఏం చేస్తాం నీతి శతకంలో వీరేశలింగంగారన్నట్టు దుఃఖభాగులు మిత్రుల మాటలని మూర్ఖొనరు ... ఏం చేస్తాం ?"

"నువ్వా చెప్పేదేదో అర్ధమయ్యే భాషలో చెప్తే సంతోషిస్తాను!"

"ఏం అర్థం కావాలోయ్! ఊహించు. ఒక వ్యక్తికి అప్తమైన వస్తువు పోయిం దనుకో, అతనెంత బాధపడతాడు. చివరి కతడి దగ్గరికెళ్లి ఆవస్తువు ఆచూకీ తెలిపా వనుకో! ఏమవుతుంది ? నీ బుజంమీద తల అన్చి, కుర్రాడిలా వలవలా ఏడ్చేస్తాడు. నువ్వే మడిగితే అది ఇచ్చేస్తాడు, అర్ధ రాజ్యమైన సరే!" అన్నాడు జయరాం.

వాసు మాట, చేష్ట లేకుండా అతణ్ణే అని మేషంగా చూస్తూ వుండిపోయాడు. గొంతు సర్దుకుని, జయరాం అన్నాడు.

"వూహించరా కుంకా! కాస్త నీగోపురాన్ని వుపయోగించు ప్లైటు యిమాజిన్ ది సీన్ మై డియర్ వెర్రి నాగన్నా! దృశ్యం గది మోహన్రావ్ తల పట్టుకుని విషాదంతో కూర్చునివుంటాడు.

కావాలంటే ఎఫెక్టుకోసం బ్యాగ్రౌండు సంగీతం పెట్టొచ్చు. వాయులీనం విషాదంగా విలపిస్తుంది. అంతలో నువ్వు ప్రవేశిస్తావు మోహన్రావు తలెత్తి చూస్తాడు అతడి కళ్లు ఎర్రగా వుంటాయి. 'ఎందుకు సార్ అంత బాధపడుతున్నారు?' అని అడుగుతావు. అతడేదోమాట్లాడబోతాడు కాని మాటలు గొంతు పెగిలి వెలికిరావు. 'ఓ, మీ వైద్య గ్రంథం కదూ! మరేం భయపడకండి! అది పోలేదు! ఉంది! దొరికింది!" అంటావు. మోహన్రావు మళ్ళీ మాట్లాడడానికి ప్రయ త్నిస్తాడు. ఈసారి సంతోషంతో అతడి గొంతు పెగలదు. 'అన్నట్టు, మీకు యింకొక్క శుభవార్తసార్! మీగ్రంధాన్ని మామిత్రుడు తన పత్రిక 'నగరఢంకా'లో ధారావాహికంగా వేయాలని తీర్మానించాడు!' అంటావు దాంలో ఆయన సంతోషం రెట్టిం పవుతుంది. 'నాయనా, నీమేలు మరచిపోను! నాగ్రంథాన్ని వెదకడమే గాకుండా దాన్ని వెలుగులోకికూడా తీసుకొచ్చావు. నీఋణాన్ని ఎలా తీర్చుకునేది ?' అంటాడు. 'దాందే ముందిసార్! మీ అమ్మాయి, నేనూ ప్రేమించుకున్నాం మాకిద్దరికీ పెళ్ళి చెయ్యండి!' అంటావు. "ఇదిగో నాయనా! ఇప్పుడే పురోహితుణ్ణి పిలిపిస్తున్నాను' అంటాడు కథ సుఖాంతం 'శుభం' అనే అక్షరాలు వెండితెరమీద కనిపిస్తాయి."

జయరాం వూపిరి పీల్చుకున్నాడు. వాసు ఆమాటల జడిలోంచి తేరుకుని, "ఏడిసి నట్టుంది, నీవూహ. అసలు జరగబోయేదిది: 'మీ పుస్తకం దొరికిందిసార్' అనగానే 'రాస్కెల్, నువ్వా దొంగతనం చేసింది! ఇప్పటికి దొరికావ్!' అని పిస్తోలుతీసి 'టిష్యూం' అని గుండుని నాతలలోంచి పంపించేస్తాడు. గొప్ప విషాదాంతం అయిపో తుంది. నల్లబార్డరు కట్టి ప్రత్యేక సంచికని నువ్వు ప్రచురించవలసి వస్తుంది!" అన్నాడు.

జయరాం అన్నాడు "సరే, అది నీదృష్టి కోణం, ఇదినా దృష్టికోణం ఈ రెంటికీ పొసగదు...సరేరా, కుంకా! ఇంక నీ ఆటోని కదిలించు నేను చాలా పనిచేసుకోవాలి!"

ఆలోచన ఎటూతెగని వాడిలా అనిశ్చలంగా నిష్క్రమించాడు వాసు.

* * *

ప్రపంచ ప్రఖ్యాతి గడించిన సిద్ధాంతాలన్నీ కూడా మొట్టమొదట ప్రతిపాదించబడి నప్పుడు విడ్డూరంగానేతోస్తాయ్ ప్రయోగ శాస్త్ర పితామహుడు గెలీలియో పైసా గోపురాన్నెక్కి ఒకరాయినీ, ఒక పక్షియీకనీ కిందికి వదలినప్పుడే, ప్లేటో సిద్ధాంతాలని నమ్ముకున్న పెద్దబుర్రలన్నీ 'దీంట్లో ఏదో మోసంవుంది" అన్నట్టు పెదవి విరిచారు. ఐన్స్టయిన్ సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రచురించి నప్పుడు— సరే! యిన్నిమాటలెందుకు ? వున్న విషయం అదీ!

నాలుగువీధులు తిరిగేటప్పటికి వాసుకి జయరాం మాటలలోని సత్యం గోచరించింది. వసుంధరని పెళ్ళాడటానికి యింతకుమించిన నికార్సయిన వుపాయం అతడికి తోచలేదు. మొదట్లో ఈ ప్రణాళిక చాలా అనాగిరకంగా కనిపించినప్పటికీ, ఇప్పుడిప్పుడే దాంట్లోని సద్గుణాలు వాసుకి అవగతమవుతున్నాయి. అసలు ఈ పద్ధతిలోనే నీట్లైన సౌలభ్యం వుంది. మోహన్రావు పుస్తకాన్ని సంగ్ర హించడం, రెండురోజులు దాన్నెక్కడోదాచేసి, ముచ్చటగామూడోరోజున దాన్ని ఆయనకి తిరిగి యివ్వడం! ఈచిన్నపని చేసినందుకు ఎంతోకృతజ్ఞత సంపాయించు కోవచ్చు! జయరాం అన్నట్టు అర్ధరాజ్యంకూడా యివ్వ గల వాళ్లుంటారు, వాళ్లు రాజులైతే! అలాంటప్పుడు కన్యాదానం చెయ్యమని అడిగితే, ఎవరు కాదంటారు!

ఆలోచన లింతవరకూ వచ్చాక, వాసుకి జయరాం గుర్తుకొచ్చాడు. అవును, మరి వాడి పత్రికేం గావాలి ?... ఆఁ! పోనిద్దూ!

(41 వ పేజీ చూడండి)



"స్పృహ రావటానికి ఇంకో పావు గంట పట్టవచ్చు" అన్నాడు డాక్టర్ సిరంజ్‌ను ప్రక్కనపెడ్తూ.

"మరేం ప్రమాదంలేదు కదా డాక్టర్?" భయపడ్తూనే అడిగాను.

"నేను చేయాల్సిన ట్రీట్‌మెంట్ అంతా చేశాను. ఆపైన మీ అదృష్టం! ఏమైనా, కావాల్సినవాళ్లను పిలిపించటం అవసరం"

డాక్టర్ నోటివెంట ఆమాట వినగానే నాకు గుండె ఆగినంత పనైంది. కాస్సేపు అలాగే నిలబడిపోయాను.

అవసరమైతే తనకు ఫోన్‌చేయమని చెప్పి డాక్టర్ వెళ్ళిపోయాడు.

"మనం ఆలస్యం చేస్తే లాభంలేదండి! చంద్రం అడ్రస్ చెబితే టెలిగ్రామ్ యిచ్చి వస్తాను" అన్నారు ప్రకాశం పంతులుగారు.

"చంద్రానికి నిన్ననే టెలిగ్రామ్ యిచ్చానండి. ఇంకాస్సేపట్లో వస్తాడు" అన్నాను మెల్లగా బెడ్‌వైపు దృష్టి నిల్పుతూ.

జీవచ్ఛవంలా బెడ్‌మీదవున్న సీతారామయ్యను చూడగానే నా హృదయం భయంతో కంపించిపోయింది. ఎప్పుడూ కళకళలాడుతూ చిఱునవ్వులను చిందించే ఆ వదనం కళావిహీనమై నా మనస్సును తీవ్రంగా కలవర పెడ్తూంది. క్రితం రోజు సాయంకాలం ప్రక్కింటి ప్రకాశంపంతులుగారబ్బాయివచ్చి 'సీతారామయ్యగారు స్పృహతప్పి పడిపోయారండి' అని చెప్పగానే నాకు మిన్ను విరిగి మీద పడ్డట్లయింది. వయస్సు పెరుగుతున్నకొద్దీ మరింత శ్రద్ధతో ఆరోగ్యాన్ని కాపాడుకోవటానికి ప్రయత్నించేవాడు సీతారామయ్య. అలాంటివ్యక్తి అకస్మాత్తుగా స్మారకం లేకుండా పడిపోవటం నాకు చాలా ఆశ్చర్యాన్ని కల్గించింది. హడావుడిగా సీతారామయ్య యింటికి పరిగెత్తుకువచ్చాను. నేను వచ్చేసరికే డాక్టర్ వచ్చి ఇంజక్షన్ చేశాడు. ఓ పావుగంటకు మెల్లగా కళ్ళు తెరిచాడు సీతారామయ్య. నన్ను చూడగానే కంటతడిపెట్టుకొన్నాడు. ఎంతో గుండెధైర్యంగల మనిషి అలా పిరికివాడిలా కన్నీరు కార్చటం చూసి నేను దిగ్భ్రాంతి చెందాను. మెల్లగా వెళ్లి మంచంమ్మీద కూర్చుని అతని కుడిచేతిని నా చేతుల్లోకి తీసుకొంటూ 'సీతారావుడూ! ఏమిటోయ్ యిది మరీ చిన్నపిల్లాడిలా? ఇప్పుడేమైందని కంటతడి పెడ్తున్నావ్?' అని అడిగేను.

'అయిపోయిందిరా సుందరం! అంతా అయిపోయింది! నేనిక బ్రతకను' అన్నాడు గద్గద స్వరంతో.

'వయస్సు పెరుగుతున్నకొద్దీ ఎవరికైనా బ్రతుకుమీద తీపి పెరగడం సహజం! అందులో తప్పేమీలేదు!' అని ఎన్నోసార్లు నాతో వాదించిన సీతారామయ్య ఆ రకంగా మాట్లాడేసరికి నేను నిశ్చేష్టుడ నయ్యాను.

'సీతారావుడూ! నీ ధోరణి నాకేం నచ్చలేదు! నిన్నటివరకూ సంతోషంగావున్న నీకు ఇంతలోనే బ్రతుకు పట్ల విరక్తి భావం ఎందుకు కల్గిందో అర్థం కావటంలేదు' అన్నాను.

'బ్రతుకుమీద విరక్తి కల్గటానికి ఎంతో కాలం అక్కర్లేదు సుందరం! ఒక్క క్షణం చాలు!' అన్నాడు కళ్ళు మూసుకొంటూ.

"చాలా వింతగా మాట్లాడుతున్నావ్!"

'లేదురా! నిజం చెప్తున్నాను. నా బ్రతుక్కి ప్రయోజనం లేదన్న విషయాన్ని తెల్సుకొన్నాను' మెల్లగా కళ్ళు తెరుస్తూ అన్నాడు.

'సీతారావుడూ! నీ నోటిమీదుగా ఇలాంటి



మాటలు వస్తాయని కలలోకూడ ఊహించ లేదు. నీవీ మాటలు ఆత్మసాక్షిగా పల్కటం లేదు. నీవలన ఎంతమంది అనాథలకు ఆశ్రయం దొరికిందో, ఎంతమంది పేదవారు విద్యావంతులైనారో అప్పుడే మర్చిపోయావా?' నీలాంటి ధర్మదాత, దయార్ద్ర హృదయుడు మరెవ్వరూ వుండరని ప్రజలంతా నిన్ను వేనోళ్ల పొగడటం మర్చిపోయావా?'

'బయటవారు నన్ను బాగా అర్థం చేసు కొన్నారన్న విషయం నాకు తెల్సు! కాని స్వంత మనుషులే నామనసును అర్థంచేసుకో నప్పుడు నా బ్రతుక్కి అర్థం వుందా?' పైన తిరుగుతున్న ఫాన్‌వైపు చూస్తూ అన్నాడు.

స్వంత మనుషులంటే సీతారామయ్య దృష్టిలో ఇద్దరే ఇద్దరు.

అతని స్నేహంలో పాలుపంచుకొనే నేను–

అతని యావదాస్తికి వారసుడైనచంద్రం.

మా ఇద్దరిదీ పాతికేళ్ల స్నేహం. నేను రెవెన్యూ ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తున్నప్పుడు అతనితో పరిచయం ఏర్పడింది. అప్పట్లో అతను కంట్రాక్టర్. అతని నీతి, నిజాయితీ కొద్దికాలంలోనే సీతారామయ్యకు పరువు ప్రతిష్టలను సంపాదించిపెట్టాయి. చుట్టు ప్రక్కల వూళ్లల్లో కూడా అతని ఖ్యాతి వ్యాపించింది. తను సంపాదించిన సొమ్మును కూడబెట్టి కోటీశ్వరుడు కావాలనే కాంక్ష అతనికెప్పుడూ లేదు. సహాయాన్ని అర్థిస్తూ ఎవరు వెళ్లినా కాదనేవాడు కాదు! నిత్యమూ అతని పెదవులమీద నాట్యంచేసే చిరునవ్వు వెనుక అమితమైన ప్రేమ, అవ్యాజమైన అనురాగం, అంతులేని ఆప్యాయతలు దాగి వుండేవి. సీతారామయ్య ప్రేమకు, అభిమానా నికి వారసు లెంతోమంది వున్నప్పటికీ అతని ఆస్తికి మాత్రం వారసుడు చంద్రం ఒక్కడే! చిన్నప్పట్నుంచీ వాణ్ణెంతో అపురూపంగా పెంచాడు వాడు బాగా చదువుకొని హోదా కల వుద్యోగి కావాలని కలలు కనేవాడు సీతా రామయ్య తను ఒంటరితనాన్ని ఎదుర్కో వాల్సి వస్తుందనే సత్యం తెల్సి వుండికూడా కాలేజీ చదువు పూర్తికాగానే పై చదువుల కోసం చంద్రాన్ని పొలేరు పంపించాడు. అతనికి కావల్సినదల్లా చంద్రయొక్క భవి ష్యత్తు! అందుకోసం ఏం చేయాలన్నా సీతా రామయ్య సిద్ధమే! మరి మేమిద్దరం అతన్ని అపార్థం చేసుకోటానికి అవకాశం ఎక్క

డుంది? ఆ విషయమే అతన్ని అడిగాను.

'చూడు సీతారావుడూ! నేను నీ ప్రాణ స్నేహితుణ్ణి! నాకు తెల్సినంతవరకు నీ మన స్సుకు కష్టం కల్గేలా నే-నెప్పుడూ ప్రవ ర్తించలేదు ఒకవేళ తెలియక నావలన ఏదైనా పొరపాటు జరిగితే చెప్పు! దానికి నేనేమీ చిన్న బుచ్చుకోనులే! అంతేకాని అనవసరంగా ఏదో విషయాన్ని మనసులోనే దాచుకొని నీ విలా మథన పడటం నా కిష్టంలేదు '

నా మాటలకు ఆశ్చర్యపోయాడు సీతా రామయ్య

'సుందరం! నీవలన పొరపాటు జరిగిందా? ఎంత మాటన్నావురా? మనం ఏ క్షణాన కల్సుకొన్నామోకాని ఈనాటి వరకు ఒకరి నొకరు విడువలేకుండా వున్నాం. అన్ని విషయాల్లోను నాకు చేదోడు వాదోడుగా నిల్చిన నీమీద నాకు కోపమా? అలా ఎన్నటికీ జరుగదురా?' అన్నాడు నా చేతుల్ని తన చేతు ల్లోకి తీసుకొంటూ.

'అయితే నీ ఆందోళనంతా చంద్రం గురించేగా?'

సీతారామయ్య మాట్లాడలేదు.

'మాట్లాడవే సీతారావుడూ! నా వూహ నిజమేనా?'

'సుందరం! నీకెలా చెప్పాలో నా కర్థం కావటంలేదు. చిన్నప్పట్నుంచీ వాణ్ణెంతో అపురూపంగా చూసుకొన్నాను. నా ప్రాణానికి ప్రాణంగా భావించాను. కాని వాడికి నామీద మమకారమన్నదే లేకుండా పోయింది. ఒక్క విషయం అడుగుతున్నాను. సమాధానం చెప్పరా! వాడికి నే నెప్పుడైనా ద్రోహం తల పెట్టానా? అసలు అలాంటి ఆలోచన నాకు కలలోనైనా వస్తుందా?' ఆవేశంతో అడిగాడు సీతారామయ్య.

'సీతారావుడూ! ఏమిటి నీవనేది? చంద్రా నికి నీవు ద్రోహం తలపెట్టడమా? ఎవ రన్నారు? అనవసరమైన ఆలోచనలతో మనస్సు నెందుకు పాడుచేసుకొంటున్నావ్?' అని నేను అడిగేసరికి సీతారామయ్య సమాధా నంగా తలగడ దిండుక్రిందున్న కవరును తీసి నా చేతికి అందించాడు.

''సుందరంగారూ! మీకు ఫోన్ వచ్చింది'' అన్న ప్రకాశం పంతులుగారి మాటలు విన్పించ గానే నా ఆలోచనలకు అంతరాయం కల్గి వర్తమానంలోకి వచ్చాను.

చెమ్మగిల్లిన కళ్లను చేతి రుమాలుతో తుడ్చుకొంటూ ఫోన్ దగ్గరకు వెళ్లాను.

అవతలి కంఠాన్ని వినగానే నాకు ప్రాణం లేచి వచ్చినట్లయింది. చంద్రం మాట్లా డేడు. తను స్టేషన్లో వున్నానని, ఇంటికి రావటానికి మనస్కరించటం లేదని, తనను వెంటనే కల్సుకోమని ఫోన్ చేసేడు. సీతా రామయ్యకు సీరియస్‌గా వుందని, వెంటనే ఇంటికి వచ్చేయమనీ నేను అనగానే రక్కున ఫోన్ పెట్టేసేడు.

వాడి మొండి పట్టుదల, మూర్ఖత్వం నాకు విపరీతమైన కోపాన్ని కల్గించాయి. ఏమైనా చంద్రాన్ని కల్సుకొని వాణ్ణి వెంటనే ఇంటికి తీసుకురావటం అవసరమని భావించి సీతారామయ్యను జాగ్రత్తగా చూస్తుండమని ప్రకాశంగారికి చెప్పి స్టేషన్‌కు బయల్దేరాను.

సిమెంట్ బెంచీమీద కూర్చున్న చంద్రం నన్ను చూడగానే లేచి నిలబడ్డాడు

''చంద్రం! నీ ప్రవర్తన ఏమీ బాగా లేదురా!'' అన్నాను నేను కోపంగా. చంద్రం మాట్లాడలేదు. మౌనంగా తల వంచు కొన్నాడు.

''చదువు కొంటున్నవాడివి, తెలివిగల వాడివి అయికూడా ఇంత మూర్ఖంగా ఎందుకు ప్రవర్తిస్తున్నావ్? చావుబ్రతుకుల మధ్య కొట్టుకొంటున్న తండ్రిని చూడాలనే ధ్యాసే లేకుండాపోయిందా?''

''మామయ్యా! నాన్నగారికి సీరియస్‌గా వుందన్న అబద్ధం చెప్పి నన్ను ఇంటికి తీసుకు వెళ్లాలనుకొంటున్నావ్ కాబోలు! అది నిష్ప్ర యోజనం.''

''చంద్రం!'' గట్టిగా అరిచాను. నా కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

''చివరకు నేనుకూడా అబద్ధాలు చెప్తు న్నానని భావిస్తున్నావా? పగవాడిక్కూడా అపకారం చేయని సీతారామయ్య చావుబ్రతు కులమధ్య నలిగిపోతున్నాడని అబద్ధం చెప్ప టమా?... చంద్రం! నా మాట నమ్ము! మీ నాన్నగారికి నిజంగానే సీరియస్‌గా వుందిరా!'' అన్నాను కన్నీరు తుడ్చుకుంటూ.

చంద్రం ముఖ కవళికలు మారాయి. కాని అడుగు ముందుకు వేయలేదు అలానే సిమెంటుబెంచీ మీద కూర్చుండి పోయాడు.

''చంద్రం! ఆలస్యం చేయకు! ఇంటికి వెళ్దాం పద!'' అన్నాను.

''క్షమించండి మామయ్యా! ఆ ఇంటి గడప త్రొక్కనని ప్రమాణం చేశాను. ఇప్పుడు

ఆత్మవంచన చేసుకోలేను" తల దించుకొనే సమాధానం చెప్పాడు.

"చంద్రం! నువ్వేనా ఇలా మాట్లాడు తోంది?" అంటూ ప్రక్కనే కూర్చున్నాను.

"మామయ్యా! మనిషి ఎప్పుడూ ఒకే రీతిగా వుంటాడనుకోవటం చాలా పొరపాటు! నిప్పు లక్షణం తెలియనపుడు చెయ్యి కాల్చు కొంటాడు పసిపాప. కాని వయస్సు వచ్చాక కూడా అలానే చేస్తాడనుకోవటం అవివేకం!"

"పిచ్చివాడా! వయస్సు వచ్చినా మనస్సు ఎదిగేవరకూ నీలాంటి పసిపాపలు ఈ లోకంలో లేరనుకోవటం అంతకంటె అవివేకం!"

''మామయ్యా!'' అభిమానం దెబ్బతిన్న వాడిలా చూశాడు నావైపు.

''చంద్రం! సీతారామయ్య లాంటి పుణ్యమూర్తిని నీవెందుకు అపార్థం చేసుకొంటున్నావో, ఎందుకు ద్వేషిస్తున్నావో నా కర్థం కావటంలేదు.''

''నీవాయనకు ప్రాణ స్నేహితుడివి కాబట్టే నీకాయన పుణ్యమూర్తిగానే కన్పించవచ్చు! ఆయన చేసే ప్రతిపని మంచిదిగానే కన్పించవచ్చు. కాని ఆ మంచి వెనుక స్వార్థం దాగుందన్న నిజం నీ వూహకందదు.''

''చంద్రం! ఏమిట్రా నీవనేది?''

''మామయ్యా! ఒకప్పుడు నీలానే నేను కూడా నాన్నగారిని అభిమానించాను! ఆరాధించాను! ఎంతో ఉన్నత వ్యక్తిగా భావించాను. కాని ఆయన్ని గురించి బయటపడిన నిజాలు నా మనస్సును దహించివేస్తున్నాయి. అలాంటివాణ్ణి తండ్రని చెప్పుకోటానికే సిగ్గుపడుతున్నాను.''

''చంద్రం!'' కోపావేశాలతో అరిచాను.

''ఆ మాటనటానికి నీకు నోరెలా వచ్చిందిరా? దేవునిలాంటి తండ్రిని దూషించే నువ్వుకూడా ఓ మనిషివేనా?''

''మనిషిని కాబట్టే నిజా నిజాలు తెల్సుకొన్నాను.''

''ఏమిట్రా, నువ్వు తెల్సుకొన్న నిజాలు?''

''ఒకరితో చెప్పుకొనేందుకు సిగ్గుపడాల్సినవి...''

''అంత సిగ్గు పడాల్సిన పన్లేమీ సీతారామయ్య చేయలేదు.''

''ఉన్న ఆస్తి సంతట్నీ దాన ధర్మాలు చేసి కొడుకును అనాథను చేయటానికి ప్రయత్నించటం, ఒక్కగానొక్క కొడుకు ప్రేమించిన పిల్లను వివాహం చేసుకొంటానంటే తీవ్రంగా అభ్యంతరం పెట్టడం — ఇవన్నీ ఏమిటి? పైకి అమృత హృదయునిలా కన్పిస్తూ హృదయంలో హాలాహలాన్ని దాచుకొన్న దానవుడు! ఓ ఆడదాని వ్యామోహంలో పడి మా తల్లిని చేతులారా చంపిన కిరాతకుడు'' ఆవేశంగా అన్నాడు.

''చంద్రం! నీవిలా మాట్లాడటం నాకేం నచ్చలేదు! అసలివన్నీ నీవంటున్న మాటలు కావు! నీ మనస్సును ఎవరో కలుషితం చేశారు. సీతారావుణ్ణి, నిన్ను విడదీయటానికి ఎవరో కుట్ర చేస్తున్నారు ప్రాణానికంటే మిన్నగా ప్రేమించిన భార్యను చంపేటంత దుర్మార్గుడా మా సితారావుడు? నాయనా చంద్రం! ఈ కట్టుకథలువిని మోసపోవద్దు! అవతల అతని పరిస్థితి బాగోలేదు. వెళ్దాం, రా!'' అంటూ చేయిపుచ్చుకొని లేవదీశాను.

''మామయ్యా! కట్టుకథలని మీరు త్రోసిపుచ్చినంత మాత్రాన నిజాలు అబద్ధాలు కావు! నా తల్లిమీద ఎనలేని ప్రేమేవుంటే తిండికి గతిలేని ఓ కూలిదాన్ని చేరదీయాల్సిన అవసరం ఆయనకేమొచ్చింది?''

ఆమాటలు వినగానే నేను కొయ్యబారి

పోయాను. నేను అనుకొన్నంతా అయింది. భూషణం చంద్రం మనస్సు పాడుచేశాడు. భూషణమంటే ఆవూరి ఛైర్మన్. అతను ఛైర్మన్ కావటానికి వెనుక చాలాగాథవుంది. ఛైర్మన్‌కాకముందు అతనుకూడా సీతారావుని లాగానే కంట్రాక్టులు చేస్తుండేవాడు. సీతా రావుడికి కీర్తి ప్రతిష్టలు మిన్నుముట్టడంతో అతనికి కన్ను కుట్టింది. దూరదేశాలకు వెళ్లి పలుకుబడిని సంపాదించి తద్వారా పెద్ద పెద్ద కంట్రాక్టులను చేపట్టి మళ్లీ కొన్ని సంవత్స రాల అనంతరం ఆవూరికే చేరుకొన్నాడు భూషణం. తను సంపాదించిన డబ్బును వుపయోగించుకొని ఛైర్మన్ పదవిని కొను క్కున్నాడు అనతి కాలంలోనే. అతని కూతురు కూడా వాల్తేరులోనే చదువుతోంది. చంద్రం ఆ అమ్మాయిని ప్రేమించాడన్న విషయం సీతారావుడిద్వారానే నాకు తెల్సింది. 'ఏదైతే జరగకూడదనుకున్నానో అదే జరిగింది సుందరం!' అని సీతారావుడు ఒకసారి చాలా బాధపడ్డాడు.

''చంద్రం! ఇంతకూ నీకా విషయాన్ని చెప్పింది ఆ భూషణమే కదూ!'' అన్నాను.

''ఎవరు చెప్పినా నిజం నిజమే!''

''హుఁ! నిజం! ఏదిరా నిజం? అసలు నిజా నిజాలు ఆ భూషణానికి, నీకు ఏం తెలుసు? ఆ నిజమే తెలిస్తే మీరిద్దరూ పిచ్చివాళ్లుగా మారి తలలు బద్దలుకొట్టు కునేవారు. నీ కసలు మనుషుల్ని అర్థం చేసు కొనే శక్తి ఎక్కడుందిలే? వాడి కూతురి వలలోపడి నిన్ను నమ్మిన వారికి ద్రోహం తల పెట్టావ్! ఆ భూషణం తేనెపూసిన కత్తి! వాడి మాటలన్నీ అబద్ధాలు! నామాటనమ్ము చంద్రం!''

''అయితే నా తండ్రి కూలిదాన్ని చేరదీసిన విషయంకూడా అబద్ధమేనా?'' సూటిగా ప్రశ్నించాడు.

నేను క్షణంపాటు మాట్లాడలేకపోయాను.

''ఆ ప్రశ్నకు నువ్వు సమాధానం చెప్ప లేవు మామయ్యా! నేను భూషణం గారమ్మా యిని ప్రేమించానేగా మీరంతా ఆయన మీద అభాండాలు వేస్తున్నారు''

''చంద్రం! ఎవరు ఎవరిమీద అభాండాలు వేస్తున్నారో అర్థంచేసుకొనే క్షణం వచ్చింది. ఈ క్షణం రానీయవద్దని సీతారావుడు నా దగ్గర మాట తీసుకొన్నాడు. ఎంతోకాలం నుంచి ఈ రహస్యాన్ని నా గుండెల్లోనే దాచు



కొన్నాను. కాని ఇప్పుడు చెప్పక తప్పటంలేదు సీతారావుడు కూలిదాన్ని చేరదీశాడన్నావు. ఆమాట నిజమే! కాని ఆమె ఎవరో భూష ణానికి ఈక్షణం వరకూ తెలీదు. ఆవిషయమే తెలిస్తే గుండె పగిలి చస్తాడు.''

''మామయ్యా! నువ్వు చెప్పేదేమిటో నా కర్థం కావటంలేదు'' ఆశ్చర్యంగా అన్నాడు చంద్రం.

''చెప్తాను చంద్రం! చెప్తాను! నీకు అర్థ మయ్యేలా చెబుతాను! భూషణం ఛైర్మన్ కాక ముందు కంట్రాక్టులు చేసేవాడన్న విషయం నీకు తెల్సినా, సీతారావుడుపట్ల అసూయ, ద్వేషాన్ని పెంచుకొన్నాడన్న విషయం నీకు తెలీదు! భూషణం దగ్గరే పనిచేసేవాడు నాగయ్య అనే మేస్త్రీ. అతను హఠాత్తుగా అక్కడ పని మానేసి సీతారావుడు ముఠాలో చేరేసరికి భూషణం ఉగ్రుడైపోయాడు. నాగయ్య అలా చేయటానికి కారణం లేక పోలేదు. అతని భార్య కూడా కూలిపనిచేసేది. భూషణం కన్ను ఆమెమీద పడింది. ఓసారి బలవంతం చేయబోయి విఫలు డయ్యాడు. నాగయ్య సౌమ్యుడు కాబట్టి భూషణంప్రాణా లతో బ్రతికాడు. సీతారావుడిపనిలో వుంటున్న నాగయ్య అకస్మాత్తుగా ప్రమాదానికి గురై మేడమీదనుంచి క్రిందపడి మరణించాడు. అతని మరణంతో భార్య ఏకాకి అయింది. ఆమె అందమే ఆమెకు శత్రువై రక్షణ లేకుండా పోయింది. ఆ పరిస్థితుల్లో సీతా రావుడు ఆమెను ఆదుకొన్నాడు. తమఇంట్లో నౌకరీ యిప్పించి ఆమెకోసం విశాలమైన తన ప్రాంగణంలో ఓ యిల్లును కూడా ఏర్పాటు చేశాడు. కాని ఆమె ఆ యింట్లో ఎక్కువకాలం జీవించలేక పోయింది. ఓ మగ

## రాలిన ముత్యాలు

........శ్రీ సోమసుందర్........

వ్యక్తి వ్యక్తాలాపన
సాహిత్యవిమర్శ కానేరదు...
శక్తి శక్తిమంతమైతేనే తప్ప
మౌక్తికం ఆవిర్భవించదు!

బిడ్డను ప్రసవించి మరణించింది. సీతా రావుడు మనస్సులానే అతని భార్య మనసు కూడా ఎంతో సున్నితం. అందంగా బొద్దుగా వున్న ఆ కుర్రాణ్ణి దంపతులిద్దరూ వదల్లేక పోయారు. తమకు పిల్లలులేని లోటు ఆ రకంగా తీరిందని భావించి ఆ కుర్రాణ్ణి దత్తు చేసుకొన్నారు......''

''అయితే నేను... ... ...''

''సీతారావుడి దత్తపుత్రుడివి!''

''మామయ్యా!'' గట్టిగా అరిచాడు చంద్రం.

వాడి ముఖంలో ఆశ్చర్యం, దుఃఖం చోటుచేసుకొన్నాయి.

''నువ్వు చెప్పేదంతా నిజమేనా మామయ్యా!'' వణుకుతున్న కంఠంతో అడిగాడు.

''నాయనా, చంద్రం! భూషణం చెప్పిన మాటలు విని మనస్సును చెడగొట్టుకున్న నీకు నా మాటలు కట్టుకథలుగా అన్పించ వచ్చు! కాని నేను నా సీతారావుడి కిచ్చిన మాటను కూడా నిర్లక్ష్యపర్చి నిజాన్ని నీకు చెప్పాను. కీర్తి జ్వాల లాంటిది. ఆ జ్వాల ప్రకాశించటానికి పూర్వాపరాలు పొగపుట్టడం సహజం. బహిర్గతమైన పొగనుచూసి దాని వెనుకనున్న జ్వాలయొక్క వునికిని మర్చి పోగలవాచెప్పు! ఆలశ్యం చేయటానికిది సమయం కాదు! సీతారావుడి కెలావుందో? త్వరగా వెళ్దాం...రా!'' అంటూ ముందుకు నడిపించుకు వెళ్లాను.

నాల్గడుగులు వేశాక ''మామయ్యా! నన్ను క్షమించండి! కన్న తండ్రి కంటె మిన్నగా ప్రేమించి పెద్దచేసిన ఆ పుణ్య మూర్తికి అజ్ఞానంతో లాయర్ నోటీసు యిప్పించాను ఆస్తికోసం! నేను క్షమించరాని నేరం చేశాను. నా ముఖాన్ని వారికి చూపించ లేను...'' అంటూ వెక్కి వెక్కి ఏడ్చాడు చంద్రం.

''పిచ్చివాడా! తప్పులు చేయడం మానవ సహజం! తన కొడుకు చేసిన తప్పునుక్షమించ లేనంత కఠిన హృదయుడు కాదు మా సీతా రావుడు. నీకోసం వేయి కళ్లతో ఎదురు చూస్తుంటాడు...వెళ్దాం...పద...''అంటూ చంద్రాన్ని స్టేషన్ బయటకు తీసుకువచ్చి ఇద్దరం టాక్సీ ఎక్కాం! టాక్సీ సీతారావుడి యింటిముందు ఆగేసరికి అక్కడ చాలా మంది జనం గుమిగూడి వున్నారు. ●

# హైదరాబాద్ నోట్ బుక్

**భాగ్యనగరానికి మరొక అందం :**

నౌబత్‌పహాడ్ పక్కనే ఉన్న కాలాపహాడ్‌పై వెన్నెలముద్దవలె, వెన్నముద్దవలె చలువరాతితో వెలసిన వేంకటేశ్వరాలయంతో భాగ్యనగరానికి మరొక అపూర్వ శోభ ఏర్పడింది. పూర్వం హైదరాబాద్‌కు ప్రతీక చార్మినార్, పూర్వమే ఎందుకు ? నేటికీ. ఇప్పుడు ఎంతో దూరం నుంచి కనిపించే కాలాపహాడ్ తెల్లగుడిలోని నల్లనయ్య భాగ్యనగరానికి మరొక ప్రతీక అయ్యాడు. ఈ నల్లనయ్య వేంకటేశ్వరుని ప్రతిష్ఠ ఫిబ్రవరి 13 వ తేదీన జరిగింది. వైభవోపేతంగా. రామకృష్ణ మత సంప్రదాయానికి చెందిన శ్రీ రంగనాథానంద 13 వ తేదీ ఉదయం దేవాలయం ప్రారంభోత్సవం జరిపారు. "హిందూ ధర్మం సనాతనం. కులమతవర్ణ లింగబేధాలు లేకుండా మానవసేవ చేయడమే దాని విశిష్టత. భారత భూమిని పుణ్యభూమి అన్నారు. ఇది ప్రతి మత పూజాలయాలకు నిలయం. కాని మానవసేవలో మాధవసేవ చూడాలి. అలా మానవసేవను ప్రోత్సహించని మాధవసేవ వ్యర్థం. పవిత్ర సుందర పరిసరాలు గల ఈ దేవాలయం మానవులలో పవిత్రసేవా భావాలను ప్రేరేపించగలదని ఆశిస్తున్నాను" అన్నారు. ప్రారంభంలో శ్రీ బి ఎం. బిర్లా స్వాగతం చెప్పారు. ముఖ్య అతిథిగా వచ్చిన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు బిర్లా ధర్మసంస్థ కృషిని ప్రశంసించారు. దేవాలయ ప్రతిష్ఠకు 'పూర్వాంగంగా ఫిబ్రవరి 7వతేదీ నుంచి 13 వ తేదీ వరకు దేవాలయంలోని యజ్ఞశాలలో ఉభయ వేదాంతాచార్య పీఠాధిపతి శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్ స్వామి యాజమాన్యాన పాంచరాత్రాగమానుసారం ప్రతిష్ఠా విధులు జరిగాయి. ఆగమశాస్త్ర విద్వాంసులు శ్రీ చిలకమర్రి శ్రీనివాసాచార్యులు ప్రధానాచార్యత్వం వహించారు. 11 వ తేదీన త్రిదండిజియ్యర్ దేవాలయంలో మహా యంత్ర ప్రతిష్ఠ జరిపారు. 13వ తేదీ సాయంకాలం ప్రతిష్ఠాయజ్ఞంలో పాల్గొన్న ఋత్విక్కులను, వేదపండితులను, శాస్త్రపండితులను సంస్థాపక్షాన, సంస్థ కార్యదర్శి శ్రీమండేలియా నూతనవస్త్రాలతోను 101 రూపాయలతోనూ సత్కరించారు. సత్కృతులైనవారిలో శ్రీయుతులు వామన్‌శాస్త్రి, శరద్‌మహారాజు, వై. సోమయాజులు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, తిరుమల రామచంద్ర (బిర్లా సాంస్కృతిక పరిశోధన సంస్థ తాళపత్రశాఖ మాజీపర్యవేక్షకుడు) మున్నగువారున్నారు. ఆ నాటిరాత్రి సుప్రసిద్ధ గాయని శ్రీమతి ఎం. ఎస్. సుబ్బలక్ష్మి వేంకటేశ్వరుని సన్నిధానంలో "తిరుపతి వేంకటరమణా"అనే త్యాగరాజ కృతిని పాడారు. దేవాలయ నిర్వాహకులు ఆమెను కాశ్మీరశాలువతో సత్కరించారు. ఈ దేవాలయాన్ని బిర్లావారిహిందూస్థాన్ చారిటీస్‌ట్రస్ట్ నిర్మించింది. ఈ సంస్థ న్యూఢిల్లీ, బృందావన్, భోపాల్‌లలో దేవాలయాలు స్థాపించింది. కాలాపహాడ్ దేవాలయం ఆ వరుసలో నాలుగవది. హిందూస్థాన్ చారిటీస్ ట్రస్ట్ 1942లో స్థాపించారు. ఇది అప్పటినుంచి వివిధ ధర్మకార్యాలు జరుపుతున్నది. ఈ వేంకటేశ్వరాలయంభూమితలంనుంచి 230అడుగుల ఎత్తున ఉన్నది. దీనినిర్మాణానికి దాదాపు వేయి టన్నుల పాలరాయి వాడారు. దీనివిలువ 50లక్షలు. ఇదంతా రాజస్థాన్ నుంచి వచ్చింది. ఆలయ నిర్మాతలు తాజమహల్ శిల్పుల సంతతివారు (వారినిగూర్చి సంవత్సరం క్రితం హైదరాబాద్ నోట్ బుక్‌లో పాఠకులు చదివే ఉన్నారు) అధిష్ఠానం నుంచి ద్వారగోపురంఎత్తు 65అడుగులు. గర్భాలయం, ముఖమండపం, ద్వారమండపం, ముఖ మండపానికి ఇరువైపులా లక్ష్మి, ఆండాళ ఆలయాలు, మూలవిరాట్టుకు ఎదుట గరుడాలయం, గరుడాలయానికి ఎదుట 42 అడుగుల ఎత్తు ఇత్తడి ధ్వజస్తంభం, బలిపీటం ఉన్నాయి. విమానం ఎత్తు 51 అడుగులు. ఉత్తరాపథ, దక్షిణాపథ వాస్తురీతులు నాగర ద్రావిడరీతులు ఈ దేవాలయంలో సంగమించాయి గర్భాలయంలో మూలవిరాట్టుకు ఎదురుగా గోడలమీద ఉబ్బెత్తుగా రాధాకృష్ణవిగ్రహాలు, సీతారామలక్ష్మణుల విగ్రహాలు, దేవాలయంచుట్టూ దశావతారవిగ్రహాలు మలిచారు. కలకత్తాలోని బాలర్టీ టామ్సన్ మాత్యూస్ కంపెనీ వారిసలహాప్రకారం, రాష్ట్ర దేవాలయ శాఖ స్థపతి శ్రీ గణపతి స్థపతి దర్శకత్వంలో, 80 లక్షల వ్యయంతో ఈ సౌందర్య రాశి అవతరించింది. వివిధ సంస్కృతులకూడలి అయిన హైదరాబాద్ నగరం సంప్రదాయానికి ముకుటంగా ఈ దేవాలయమూ అన్ని సంప్రదాయాల సంగమం. వాస్తు సంప్రదాయంనాగర ద్రావిడ శైలుల సంగమం. తెల్లని రాజస్థాన్ చలువరాతి దేవాలయంలో ఫిరంగిపురం నల్లరాతి మూలవిరాట్టుమూర్తి శిల్పులు ముస్లింలు. ఏ మతం వారయినా ఏ దేశంవారయినా ఏ కులం వారయినా ఈ దేవాలయంలో ప్రవేశించవచ్చు. ఈ దేవాలయం పారిశుద్ధ్య రక్షణ కోసంధర్మకర్తలు చేసిన మరొక గొప్ప ఏర్పాటు దద్ధ్యోదనాది ప్రసాదాల్లు లేక పోవడం, కొబ్బరికాయలుకొట్టక పోవడం కొబ్బరికాయ కొట్టనిదే సంతృప్తిపడని భక్తులు కొండకిందిహనుమదాలయంలోకొట్టాలి. బిర్లా హిందూస్థాన్ ఛారిటీస్‌ట్రస్టువారు నెలకొల్పిన వెంకటేశ్వరుడు సమన్వయ దృష్టిని సమదృష్టిని ఆంధ్రావళికి కలిగించ గలడని ఆశిస్తున్నాను.

## వి వా హం

ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణ, తమ సోదరుడు (కీ. శే. శివలెంక శంభు ప్రసాద్ గారి రెండవ కుమారుడు) అమృతాంజన్ లిమిటెడ్ మానేజింగ్ డైరెక్టర్, ఆంధ్రపత్రిక ప్రచురణ కర్త, ముద్రాపకుడు అయిన, చిరంజీవి నాగేశ్వరరావుకు శ్రీ పేరేపి వేంకట శేషయ్య గారి కుమార్తె చిరంజీవి సౌభాగ్యవతి వెంకట శేషమ్మను యిచ్చి ఫిబవరి నెల 18 వ తేదీ ఉదయం మద్రాసు మౌంట్ రోడ్డులోని 'ఆబట్స్ బరీ'లో వైభవంగా వివాహం జరిపించారు. ముహూర్త సమయానికి, నాటి సాయంకాలం జరిగిన అతిథి సత్కారానికి విచ్చేసిన పలువురు ప్రముఖులు, పెద్దలలో రాష్ట్రమంత్రి శ్రీ జె. చొక్కారావు, మద్రాసు మాజీ ముఖ్యమంత్రి శ్రీ భక్తవత్సలం, శ్రీయుతులు ఎస్. బి. పి. పట్టాభి రామారావు, ఎస్. బి. పి. సత్యనారాయణ, ప్రొఫెసర్ రామచంద్రన్, ఆర్. కుచేలర్, మాగంటి అంకినీడు, నాగిరెడ్డి, బి. ఎన్. రెడ్డి, కె. ఎల్. ఎన్. ప్రసాద్, వై. రామకృష్ణ ప్రసాద్, టి. వి. యస్ చైర్మన్ శ్రీనివాసన్, ఎన్. టి రామారావు, అక్కినేని నాగేశ్వరరావు, దాసరి నారాయణరావు, దాశరథి, నారాయణరెడ్డి, ఆరుద్ర, దేవులపల్లి కృష్ణశాస్త్రి, పుల్లయ్య, ఎం. ఎస్ సుబ్బారావు మున్నగు వారలు ఉన్నారు. రిసెప్షన్ సమయంలో చిట్టిబాబుగారి వీణ కచేరీ జరిగింది. కేంద్ర మంత్రి శ్రీ కొత్త రఘురామయ్య నూత్న వధూవరులను ఆశీర్వదించారు.

**ఉ ప శ్రు తి :**

"దక్షిణాఫ్రికాలో ఒక తెగవారికి దీర్ఘోపన్యాసాలు ఇష్టం లేదట. ఒంటికాలిపై నిలబడగలిగినంతసేపే మాట్లాడాలని నియమమట. మన నాయకులకూ ఇలాటి నియమం పెడితే మంచిదేమో ? సార్ !" అన్నాను ఒక సుమార్గైన నాయకునితో. "అలా చేసినా మన నాయకులు గంటలతరబడి మాట్లాడడం మానరు. ఒంటికాలి మీద, ఒంటిచేయి మీద నిలబడడానికి హఠయోగ పాటశాలలు ఊరూరా నెలకొల్పి అయినా సాధన చేస్తారు" అన్నాడు ఆయన.

—తిరుమల రామచంద్ర

# నాసికేతుని కథ

నిడదవోలు వెంకటరావు



[నేడు ప్రచారంలో ఉన్న గర్భనిరోధక మాత్రల ద్వారా, ఫలితంలభించకపోవడమే గాక, అవి దుష్ఫలితాలకు దారితీసి స్త్రీ ఆరోగ్య స్థితికి భంగకరంగా ఉన్నవని ఆ మాత్రలకు బదులు, ముక్కు ద్వారా, మందు ఎక్కించి, దానిమూలంగా గర్భ నిరోధన చేయవచ్చునని, శస్త్ర చికిత్స కూడా అవసరంలేదని, అన్నివిధాలుగా అతివలకు, ఇది ఆరోగ్యవర్ధకమే గాక, సంఘానికి శ్రేయస్కర మని, ఒక క్రొత్త పద్ధతిని క్రొత్త ఢిల్లీలో అఖిలభారత వైద్యశాస్త్రసంస్థలోని, పరిశోధక వర్గంవారు కనిపెట్టారు. (ఆంధ్రపత్రిక — 5–11–75)

ఇట్టి పద్ధతిని కనిపెట్టిన డాక్టరు ఆనందకుమార్ గారిని, వారి సహచర వర్గాన్ని చాలా అభినందిస్తున్నాను.]

ఈనాడు మనం పాశ్చాత్య వైజ్ఞానిక ప్రపంచంలో, ఏ క్రొత్త సిద్ధాంతాన్ని ప్రతి పాదించినా, ఏ క్రొత్త విషయం కనుక్కున్నా అవి మన భారతీయ విజ్ఞానానికి మాత్రం పాతవే— అందుకు నేటి ముక్కుద్వారా గర్భ నిరోధక పద్ధతే నిదర్శనం. ముక్కుద్వారా గర్భోత్పత్తి అయినప్పుడు ముక్కుద్వారా గర్భ నిరోధకం అవడానికి ఏ ఆటంకం లేదు గదా. మొదట ముక్కుద్వారా గర్భోత్పత్తి అయిన కథ విందాం.

బహు ప్రాచీనమైన వైదిక వాఙ్మయంలో నాసికేతుని కథ ఉన్నది. నాసికేతుడు అనగా, నాసిక — ముక్కుద్వారా జన్మించిన వాడని అర్థం. వైదిక వాఙ్మయంలో, 'నచికేతస్' అన్నది లౌకిక వాఙ్మయంలో 'నాసికేతుడు' అయినది. ఉపనిషత్తులలో కఠోపనిషత్తుకు సంబందించిన కథ, ఈ నాసికేతునిదే.

బ్రహ్మమానస పుత్రుడైన ఉద్దాలకుడు, యౌవనం రాగానే, తపస్సుచేయడం ప్రారం భించాడు, తండ్రియైన బ్రహ్మకు అది ఎంతమాత్రమూ ఇష్టంలేదు — కుమారుడు తపస్సు చేస్తూండగా, బ్రహ్మ వెళ్ళి, నాయనా! "నీవు పెళ్ళిచేసుకో గృహస్థాశ్రమ జీవితం గడపడం — చాలా మంచిది" అని బోధించాడు.

ఉద్దాలకుడు, తండ్రి మాటలు విని, "ససేమిరా, నేనెంతమాత్రం పెళ్ళిచేసుకోను

ఇలాగే తపస్సుచేసి, ఋషినై పోతాను. ఇది నా నిశ్చయం, తిరుగులేదు'' అన్నాడు. ''సరే నాయనా! నీ మనోనిగ్రహానికి, చాలా సంతోషించాను. నీకు పుట్టిన కుమారుడే, నీభార్యను నీకు తెలుపుతాడు —'' అని వెళ్లిపోయాడు బ్రహ్మ.

తండ్రి చెప్పినమాట తథ్యం కాకుండా చెయ్యాలని— ఉద్దాలకుడు సంకల్పించాడు. కఠోర నియమాల తపస్సు మొదలుపెట్టేడు. ఇంద్రియాలను అదుపులో ఉంచాడు. వాయు నిరోధం చేసి, యోగాభ్యాసంలో సిద్ధి పొందాడు — ఎప్పుడూ యోగ సమాధిలో ఉండేవాడు.

ఒకనాటి రాత్రి పండువెన్నెల — అప్పుడే ఉద్దాలకుడు, యోగసమాధి చాలించి, నిద్ర పోయినాడు. గాఢంగా నిద్ర పట్టింది. ఆనిద్రలో కలవచ్చింది. ఎవరో ఒక జవ్వని— అతన్ని ఆప్యాయంగా తన బాహువులతో బంధించి, కౌగలించుకొంది. వెంటనే అతనికి వీర్యస్కలనం అయింది — దానితో తెలివి వచ్చింది.

ఈ హఠాత్ సన్నివేశానికి—అతడు చలించ లేదు — తన వీర్యాన్ని సంగ్రహించాడు — దగ్గఱగా ఉన్న గంగానదిలో, తామరాకులను కొన్ని తీసికొన్నాడు. వానిని, ఒక పువ్వు ఆకారంగా చేసేడు. అమధ్య తన వీర్యాన్ని నిక్షిప్తం చేసేడు. ఆ తామరపువ్వును, ఆకులు చెదరిపోకుండా గట్టిగా బంధించాడు. దాన్ని — ఆనదిలో విడచిపెట్టాడు. తాను తిరిగి యోగంలో మునిగేడు.

ఆ తామరపువ్వు అలా, అలా, నీటిపైని తేలిపోతూ నదిలో ప్రయాణం చేస్తున్నది. కాని దాని పరిమళం మాత్రం ఒడ్డుకు వ్యాపిస్తున్నది. ఉద్దాలకాశ్రమం దాటి కొంత దూరంలో వున్న ఒక ఒడ్డున నీటిలో ఆ తామరపువ్వు నిలిచింది.

## 2

అప్పటికి పూర్తిగా తెల్లవారింది. ఆ సమయంలో రఘుమహారాజు కూతురు చంద్రవతి ఋతు స్నానార్థమై గంగానదికి, చెలికత్తెలతో వచ్చింది. వారందఱు నీటిలో దిగారు. చంద్రవతి స్నానం చేసేసరికి, ఆమెకు ఎదురుగుండా, నీటిలో, తామరపువ్వు అగపడింది. పువ్వు, ఎంతో సువాసనగా వున్నది. ఆ వాసన సోకగానే, ఆమె ఆ పువ్వును, చేతితో తీసుకొన్నది.

ఒడ్డుకువచ్చి, బట్టలు మార్చుకొని, ఆమె ఆ పువ్వును చేతితో పట్టుకొని, దానిని వాసనచూస్తూ అలాగే తన అంతఃపురానికి నడిచింది. వచ్చిన తరువాత దానిని వాసన చూస్తూ తన ఎదురుగా వుంచుకొని నిద్రించింది.

మర్నాడు లేచేసరికి, ఆమెకు తనశరీరంలో ఏదో ఒక క్రొత్త చైతన్యం కదలిస్తూ వున్నట్లు గ్రహించింది. అద్దం దగ్గరకు వెళ్లింది. తన ముఖం ఒక క్రొత్త కాంతిని విరజిమ్ముతూంది. ఆమెకు చాలా ఆశ్చర్యం వేసింది. వెంటనే ఏదో అనుమానం కలిగింది.

ఇంతలో తన కత్యంతాప్తులైన చెలికత్తెలు వచ్చారు. ఆమెను చూసీ చూడడంతో గతుక్కుమన్నారు. చంద్రవతికి గర్భధారణ అయినది! అట్టే వారు నిలబడి పోయారు. వారి చూపుల్లో, వారి ముఖకవళికల్లో చంద్రవతి, తాను గర్భిణియైనట్లు గ్రహించింది.

ఎవరిమట్టుకు వారే ''పోతుటీగ అయినా జొరబడ్డానికి వీలులేని అంతఃపురంలో, చంద్రవతికి కడుపెట్లయినది'' అని తబ్బిబ్బులు పడిపోతున్నారు. ఏమైనా ఈరహస్యం బయటపెట్ట కూడదని చెలికత్తెలు తీర్మానించుకొన్నారు.

చంద్రవతి మాత్రం ''అయ్యో! అతి పవిత్రమైన ఈ సూర్యవంశానికి, ఇంత కళంకం తెచ్చానే'' అని కుమిలిపోయింది.

తాను ఋతుస్నానార్థం వెళ్లినపుడు దొరకిన పువ్వును వాసన చూచినందువల్ల, తనకు గర్భమైనదని ఆమెకు తెలియనే తెలియదు.

''క. శ్వసన వశంబున మన్మథ
రసముదరములోన జొచ్చి రసవహనాది
ప్రసరణ గతి చనుదెంచుచు
నసితేక్షణ గర్భశయ్యయందువసించెన్''

తామరపువ్వు నందు గల పురుష వీర్య గర్భ ధారక రేణువులు, వాసన చూడగానే ముక్కు నుండి, గొంతుక ద్వారా కడుపులో ప్రవేశించి, ప్రేగుల ద్వారా, గర్భాశయములోనికి వెళ్లి, అందు నిలిచిపోయినవి. అప్పుడే ఋతుస్నాత కావడము వల్ల, గర్భోత్పత్తి యైనది.

ఎంత అంతఃపురంలో అయినా, చెలికత్తెలు కప్పిపుచ్చినా, ఎంతకాలం ఇతరులకు తెలియకుండా ఉంటుంది? కొన్ని నెలలు కాగానే, వారాగలేకపోయినారు — చంద్రవతి తల్లికి ఈ విషయం చెప్పారు. ఆమె చాలా విచారించి, భర్తతో ఈ సంగతి ప్రస్తావించింది. రఘుమహారాజు, తర తరాలుగా అచ్ఛమైన యశస్సుతో వెలిగే, తన వంశంలో మచ్చ వచ్చినదే అని చాలా పరితపించాడు. దీనిని తన నగరంలో ఉన్న వాళ్లకు తెలియకుండానే, ఏ రీతిగానైనా అణచిపెట్టవలెనని నిశ్చయించాడు. ధర్మశాస్త్రవేత్తల దగ్గఱకు తాను కాకుండా, ఇతరులచేత ఇట్లు కబురు పంపాడు.

''అమ్మాయి వివాహిత కాకుండా, గర్భము ధరించినపుడు, తలిదండ్రులు చేయవలసిన







# నాసికేతుని కథ

విధాన మేమిటి? తెలుపవలసినది."

వారు ఆ అమ్మాయిని అడవులలో విడిచి పెట్టడమే కర్తవ్యమని తీర్పు చెప్పారు.

రఘుమహారాజు తన కూతురి నట్లే ఇతరు లెవ్వరికి తెలియకుండా అడవులకు పంపాడు.

## 3

చంద్రవతితో వచ్చినవారు ఆమెను ఒక మునీశ్వరాశ్రమంకు కొంచెం దూరంగా విడిచారు. ఆమె దారి తెన్నులేక విలపిస్తూంటే త్రుణబిందుడనే మునీశ్వరుడామెను చూచాడు. ఆమె నోదార్చాడు.

తన దివ్యదృష్టిచేత, జరిగిన సంగతి అంతా గ్రహించాడు. ఆమె గర్భంలో వున్నవాడు బ్రహ్మ కుమారుడైన ఉద్దాలకుని కుమారుడని తెలుసుకొన్నాడు. ఆమెను తన ఆశ్రమానికి చేర్చి, ఆమె రక్షణకు పరిచర్యలకు మునికన్యలను నియమించాడు.

కొన్నాళ్లకామె ప్రసవించింది. పుట్టిన బిడ్డ మంచి తేజస్సుతో వున్నాడు.

ఆబిడ్డ—నాసిక (ముక్కు) ద్వారా జన్మించినవాడు కాబట్టి 'నాసికేతుడు' అని పేరు పెట్టాడు.

నాసికేతుడు పుట్టగానే చంద్రవతికి "ఈ బిడ్డ పెరిగి పెద్దవాడయి నాతండ్రి ఎవరు" అని అడిగితే నేనేం చెప్పగలను? "ఇప్పుడే ఏదో ఒకటి చెయ్యాలి" అని ఆలోచించింది.

అలా ఆలోచిస్తూండగా, ఆమెకు, వివాహం కాకుండా కుంతికి పుట్టిన కర్ణుని సంగతి జ్ఞాపకం వచ్చింది. ఇదే బాగుందనుకుంది. ఆనాడు కుంతి, కర్ణుని ఒక మందసం (పెట్టె) లో పెట్టి నదిలో వదలిపెట్టినట్టుగా, తన శిశువును చంద్రవతి ఒక పెట్టెలో పెట్టి—

"నీ తండ్రిని నువ్వే చూసుకో" అని అనుకుంటూ నదిలో విడచిపెట్టింది.

ఆ పెట్టె అలాగే నీటిమీద తేలుతూ ఒక స్నానాలుచేసే ఒడ్డుకు కొంచెం దూరంగా నిల్చింది.

ఉద్దాలకమౌని అప్పుడే స్నానం చేయడానికి ఆ నది ఒడ్డుకు వచ్చాడు. నీటిలో దిగగానే ఎదురుగా ఆ పెట్టె కనిపించింది. దాన్ని రెండు చేతులతో జాగ్రత్తగా పట్టుకొని, గట్టుమీద పెట్టాడు. స్నానం ముగించాడు. పెట్టె తెఱచి చూచాడు. చూడగానే—

మూడు మూర్తులు తన పోలికగా అచ్చు గుద్దినట్లున్న మగశిశువు ప్రత్యక్షమైనాడు. ఆప్యాయతతో ఆ శిశువును ఆశ్రమానికి తీసుకొనివెళ్లి, మునిపత్నులకు ఆ శిశుపోషణ అప్పగించాడు. నాసికేతుడు పెరిగి, ఆడుకొనే ఈడుకు వచ్చాడు.

## 4

చంద్రవతికి పుట్టిన బిడ్డను వదలినా, ఆ బిడ్డపై మమకారం పోలేదు. త్రుణబిందుని ఆశ్రయంలో జీవితం చల్లగా సాగిపోతున్నా ఆమె మనస్సులో నాసికేతుని మొగం మెదులుతూనే వుంది. అప్పుడప్పుడు పెరిగి పెద్దవాడయినట్లు కలలు కూడా వస్తూండేవి. కొంతకాలం అయ్యేక ఆమెకు ఇక ఉండబట్టలేదు. ఎలాగైనా తన పిల్లడిని చూద్దామనే సంకల్పంతో ఆశ్రమాన్ని విడిచి బయలుదేరింది.

దారినబడి వెళుతూంటే, కొంచెం దూరంలో ఆమెకు ఒక మలుపు కనిపించింది. ఆ మలుపులోనికి వెళ్లేసరికి ఒక కాలిబాట చూచింది. ఇది ఎక్కడికి వెడుతుందో చూదామని ఆ బాటవెంట నడిచింది. కొంతదూరం వెళ్లేసరికి ముందు ఒక ఆశ్రమం కనిపించింది. ఆశ్రమం కనబడగానే, ఆమె కేదో పట్టరాని ఆనందం కలిగింది. ఎడమకన్నదిరింది. ఆశ్రమంలో అడుగు పెట్టేసరికి ఎవ్వరూ కనబడలేదు. ఇటూ అటూచూచింది. వెనకప్రక్క పిల్లలతో ఆడుతూన్న అబ్బాయి కనిపించేడు. కొంచెం నిదానంగా చూచింది నిజంగా, తన నాసికేతుడే. ఆకన్ను, ఆముక్కు తీరు అంతా అదే. తక్షణమే వెళ్లి తన దగ్గరకు లాక్కుంది. 'అమ్మా' అంటూ ఒడిలో ఒండిపోయాడు. తక్కిన పిల్లలు అలా చూస్తూ నిలబడిపోయారు.

ఆమె నాసికేతుణ్ణి "నిన్నెవరు పెంచుతున్నారు" అని తల నిమురుతూ అడిగింది. "ఎవరో ఉద్దాలకుడనే ఆయనట! నన్ను నాన్నలాగే ఎంతో గారాబంగా పెంచుతున్నారు" అని చెప్పాడు. అయితే "అత డెప్పుడు ఇంటివద్ద ఉంటాడు" అని తిరిగి అడిగింది సాధారణంగా ప్రొద్దుట వెళ్లి సాయంకాలం వస్తూంటాడు. ఒక్కొక్కప్పుడు రెండురోజులకి గాని రాడు. మొన్నన

(32 వ పేజీ చూడండి)

(గత సంచిక తరువాయి)

# సూర్యుణ్ణి చూసిన కళ్ళు

'యామిని'



అక్కడనుంచి నేను తిన్నగా బ్యాంకుకు వెళ్లిపోయాను. బ్యాంకులో నేను అనుకోని సమస్యలు కొన్ని రావడంతో సాయంత్రం బ్యాంకు వదిలేసరికి ఏడున్నరయిపోయింది. భానుమతి యింటికి సాయంత్రం టీకి వెళ్లలేకపోయేను.

బయటికి వచ్చేసరికి భానుమతి గుర్తుకొచ్చింది. ఓ క్షణం తటపటాయించేను. ఆ టైములో ఆమెను డిస్టర్బు చెయ్యడం అవుతుందేమోనని భయపడ్డాను. అయినా కనీసం వస్తానన్న టైముకు వెళ్లలేకపోయినందుకయినా అంత దగ్గరలో వుండి వెళ్లకపోతే బాగుండదని వెళ్లేను. సమయానికి వీధి దీపాలుకూడా ఆరిపోయాయి. మొత్తానికి ఒకళ్ళిద్దరిని అడిగి ఆమె గుర్తు చెప్పిన యింటిముందు నుంచున్నాను. తలుపు కొడదామా అని ఆలోచిస్తూంటే యింటికి కుడివైపు వున్న గది తలుపు తెరుచుకుంది. భానుమతి బయటకు వచ్చింది.

"వస్తానన్నవాడు రాలేదేమిటా అని ఆలోచిస్తున్నాను. రా లోపలకు రా!" అని చూపించింది. ఆమె వెనకాలే లోపలకు వెళ్లేను.

పాలాస్త్రీ పెంకులతో కట్టిన పాతరకం డాబా అది. ఆమె వున్నది సన్నగా పొడుగాటి హాలులా వున్న ఒక గది. గదిలో రెండు మూలల్లో రెండు పెద్ద కొవ్వొత్తులు వెలుగుతున్నాయి. ఓ మూల వంట సామానులు వున్నాయి. మరో మూలకు పుస్తకాల దొంతరలు. క్రింద నేలమీద టేబిల్ ఫాన్ ఒకటే వుంది. ఉన్న ఒక పేముకుర్చీ నావైపు జరిపి తనో తుంగచాప పరచుకుంది. విసినకర్ర ఒకటి నా చేతికిచ్చింది.

"టీకి రమ్మంటే యిలా భోజనానికా రావడం?" చిరుకోపం నటిస్తూ అడిగింది.

జరిగింది చెప్పేను. భోజనం చెయ్యనన్నాను.

"ఇప్పుడు నువ్విక్కడ భోజనం చేస్తే నీకోసం ఎదురు చూసేవాళ్ళు ఇక్కడ లేరుగా! భోజనం చేసి వెడుదువుగాని..."

నేనేదో చెప్పబోతూంటే "ఈ నసగడం అదీ వద్దు. ఇన్నాళ్ళ తరువాత కనిపించేవు. ఎదురు చెప్పకు. ముందు ఓ కప్పు టీ ఇస్తాను. నువ్వు మాట్లాడుతూ ఉండు... నేను వంట చేస్తాను." అంటూ వెళ్లి స్టౌ అంటించింది.

"రిజర్వు బ్యాంకులో ఆఫీసరువైనట్లూ, పెళ్లయినట్లూ తెలిసింది. ఓ శుభలేఖ కూడా వెయ్యలేకపోయేవే!" అంది. కాస్సేపు విలవిల్లాడేను. నిజమే! శుభలేఖ వెయ్యలేదు.. చేసేది లేక 'సారీ!' అన్నాను.

"ఫరవాలేదులే! వట్టిగా వేళాకోళాని కన్నాను. ఏమిటో చదువుకొనే రోజుల్లో స్నేహితులు తప్ప మరో ప్రపంచమే లేదనిపిస్తుంది. నిజంగా ప్రపంచంలో అడుగు పెట్టిన తరువాత నెల మొదటి నుంచి చివరి వరకూ తారీఖులు లెక్క పెట్టుకోవడం మొదలెట్టిన తర్వాత ఈ బంధాలన్నీ పురి లేని దారాల్లా పుటుక్కున తెగిపోతాయి. ఎవళ్ళ బురదలో వాళ్ళు ఊపిరాడక చావడమే..."

భానుమతి మనసులో భావం అర్థం కాలేదు.

టీ గిన్నె దింపి వేరే గిన్నె పెడుతూంటే

పెద్దకథ

స్టౌ మంటల వెలుగులో విచిత్రంగా వెలిగింది భానుమతి ముఖం.

ఆమె మాటలవలన ఆమెకు శుభలేఖ వ్రాయని లోపం మరీ ఎక్కువగా అనిపించింది.

నా మనసులో ఆలోచన పసికట్టినట్లుంది. "నువ్వు సీరియస్‌గా తీసుకున్నట్లున్నావే! ఏదో తమాషాకన్నా నంతే... అయినా వీటిలో ఏముంది!... నువ్వు శుభలేఖ వ్రాస్తే నేను వచ్చేనా చూసేనా... ఏవో ఫార్మాలిటీస్... ఒక్కొక్కప్పుడు అవి అవసరమా అని నాకూ అనిపిస్తుంది."

నేనేమీ మాట్లాడలేదు. ఆమెను మరోలా ఊహించకపోయినా అలా ఒంటరిగా ఉండడం కూడా ఆశ్చర్యంగానే కనిపించింది. తెలుసుకోవలసిన విషయా లెన్నో ఉన్నాయి. ఈ లోపున ఆమే అడిగింది. "పిల్లలెంతమంది? మీ ఆవిడ ఏం చదువుకుంది?" అని

"ఓ అబ్బాయి. మూడేళ్ళుంటాయి."

"మళ్లీ ?..."

"ఆరో నెల."

"దటీజ్ నైస్." టీ కప్పు చేతి కివ్వడానికి వంగుతూంటే మెడలో ఒంటిపేట గొలుసు తళుక్కుమంది.

వెంటనే భానుమతి శేఖర్‌ల స్నేహం గుర్తొచ్చింది అయినా ఆ సంభాషణ ఎలా మొదలు పెట్టాలో తెలీలేదు ఇంతలో వాళ్ళ నాన్నగారు గుర్తొచ్చేరు. ఎలా ఉన్నారని అడిగేను.

"నాన్నగారు పోయి ఏడాది దాటిపోయింది."

"ఐయామ్‌సారీ! .. మీ నాన్నగారు పోయినప్పుడు ... ఆయన చివరిరోజుల్లో నువ్వు ఆయన దగ్గరే వున్నావా ?..."

టీ కప్పు పెదవులకు తగిలిస్తూన్న ఆమె ఒక్కసారి చురుక్కున నావైపు చూసింది. నేను కొంచెం తడబడ్డాను దానితో ఆమెకు జరిగిన సంఘటనలక్రమం గుర్తొచ్చినట్లుంది. ఆమె ముఖం మీద భావమూ మారింది

"ఓ! ... రెండు సంవత్సరాలు పైగా నను కుంటాను. వేరే వున్నాను తరువాత ... శేఖర్ స్టేట్స్‌కు వెళ్లి దగ్గరగా రెండు నెలలయింది. నాన్నగారు ఒకరోజు నన్ను పిలిపించేరు. నన్నూ నా ఆలోచనలనూ ఒప్పుకున్నారు. ఆ తర్వాత నాలుగు సంవత్సరాలు బ్రతికేరు ... ఆ నాలుగు సంవత్సరాలు. .వాటె లవ్లీ లైవ్ !"

ఆమె కనుకొలకుల్లో కన్నీటి చుక్కలు మెరిసేయి

"అయితే ఒంటరిగా ఇక్కడెందుకుంటున్నావు ?"

"లేదు మా అత్తయ్యావాళ్ళూ నాతో వుంటున్నారు .. అన్నీ వెనుకముందు లవుతూన్నట్లున్నాయి. చెప్తాను. వరుసగా చెప్తాను." అని జరిగిందంతా వివరంగా చెప్పడం మొదలుపెట్టింది కూరకు వంకాయముక్కలు తరుగుతూ

".. నాన్నగారు పిలిపించేరని చెప్పేనుగా! ఆ రోజు నా పుట్టినరోజు. నాన్నగారు మా యింటి బయట వరండాలో యీజీచైర్లో పడుకున్నారు చాలా నీరసించి దిగులుగా కనబడ్డారు నా ప్రాణం చివుక్కుమంది. గబగబా వెళ్లి "ఎలా వుంది నాన్నా ?" అని బుగ్గమీద చేయివేసి చూసేను. నా చేయిమీద తన చేయి వుంచి నొక్కేరు నాన్నగారు. ఆయన కళ్లల్లోంచి ఉబికివచ్చిన కన్నీరు నాచేతికి తగిలింది."

"ఏమిటి నాన్నా ?" అన్నాను.

"నన్నెందుకు విడిచి వెళ్లిపోయావమ్మా!" అన్నారు.

మెల్లగా నేను ఆయన కాళ్ళదగ్గర కూర్చున్నాను.

"ఆ మాట నన్నడుగుతున్నారా ?" అన్నాను.

"అడగనమ్మా! అడగను." నా తల ఆయన ఒడిలో పెట్టుకున్నారు. నా తల నిమురుతున్నారు. ఆయన చెయ్యి నా తల మీద కదులుతూంటే నా హృదయం కరిగిపోయింది. నిశ్శబ్దంగా కన్నీళ్ళు కార్చేను. పది నిముషాల తరువాత నాన్నగారన్నారు. "నేనూ పేదవాడిగానే పుట్టేను భానూ! తోటి మనిషిని వాడే వర్గానికి చెందినా ఎలా ప్రేమించాలో ఎలా జీవించాలో ఎన్నో ఊహించి వాటి సమస్యల నన్నింటిని చర్చిస్తూ పుస్తకాలు వ్రాసేను. గొప్ప మేధావిగా పేరు పొందేను. చాలా డబ్బు సంపాదిం




చేను కాని నువ్వు పట్టించుకున్నట్లు వాటిని నరాలకు పట్టించుకోలేక పోయానమ్మా! నువ్వు ఈ రెండు సంవత్సరాలూ జీవించినట్లు నేను జీవించలేకపోయేను... భానూ! ఒక్క విషయం చెప్పనీ తల్లీ! ఐయామ్ ప్రౌడాఫ్‌యూ!"

ప్రేమాతిశయంతో నా గొంతు పూడిపోయింది. "అయితే నేను మీతో ఉండొచ్చా నాన్నా ?" అన్నాను చివరకు.

"లేదమ్మా! అది నిన్ను నే నడుగవలసిన ప్రశ్న. నువ్వు మాత్రం కాదనకు సుమా!.. నువ్వు గంజి త్రాగమంటే తాగుతాను అంగవస్త్రం కట్టుకోమంటే కట్టుకుంటాను..." వినలేక నాన్న నోరు మూసేశాను.

"నాన్నగారు నన్ను పట్టుకొని చంటిపిల్లవాడిలా భోరున ఏడ్చేశారు ఓ మై గాడ్!..." భానుమతి కళ్ళనిండా నీళ్ళు నిండిపోయాయి. గొంతు బిగిసిపోయింది

స్టౌమీద గిన్నెలో నీళ్ళు పొంగి మూత కణకణా చప్పుడవుతూంది వెంటనే మూత తీసింది.

మరో రెండు నిముషాల్లో భానుమతి మామూలు మనిషయింది.

"...చెప్పొచ్చేదేమంటే నాన్నగారు చాలా మారిపోయారు ఈ సమాజపు అంతస్థుల తెరలు కొన్ని రోజులు ఆయన దృష్టికి అడ్డు వచ్చేయి. ఆయనొక మహత్తరమైన వ్యక్తి ఆయన కూతురుగా పుట్టడం నా అదృష్టం ఆ తరువాత నాకు ఆయన తండ్రిగా కాక అత్యంత ఆప్తుడైన మిత్రుడిగా కూడా మెలిగేరు శేఖర్‌ను గురించి ఎన్నో అడిగేరు. మా యిద్దరి మధ్యా జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు చదవమని ఇచ్చేను. ఆయన మా స్నేహాన్ని పూర్తిగా అంగీకరించేరు. నా ఆశయాలకు ఆయన సానుభూతి పూర్తిగా ఉంది. అది ఒక పరిపూర్ణమయిన జీవితం. ఆయన పోవడంతో నేను చాలా కోల్పోయేను... నాన్న పోయిన తరువాత మా అత్తయ్యా, మామయ్యా నాతోనే ఉన్నారు. మా యింటిలో ఒక స్కూలు పెట్టి నాకున్న కొన్ని ఉద్దేశ్యాలకు అనుగుణంగా అది నడపాలనుకున్నాను. దానికి నాన్నగారు ప్లాను వేశారు. ఇంటికి కొన్ని మార్పులు చెయ్యవలసివస్తే ఓ నెల రోజుల నుంచి అవి చేయిస్తున్నాను. అత్తయ్యా, మామయ్యా వాళ్ళ అమ్మాయి దగ్గర ఓ నెల రోజులు ఉండి వస్తామని వెళ్లేరు. ఇంటి మార్పులు పూర్తయే వరకూ ఇప్పుడు నేను పని చేసే స్కూలుకు దగ్గరగా ఉంటుందని ఇక్కడ అద్దెకుంటున్నాను. అన్నట్లు ఈ మధ్యలో నేను ప్రైవేటుగా పోస్టు గ్రాడ్యుయేషను పూర్తిచేసి తరువాత బి. ఇడి ట్రెయినింగు కూడా పూర్తి చేసేను ఇప్పుడు కాలువ అవతల గరల్స్ హైస్కూలులో టీచరుగా పని చేస్తున్నాను."

కాని భానుమతి శేఖర్‌ని గురించి ఏమీచెప్పలేదు.

భోజనం చేసినంతసేపూ నా కబుర్లతో గడిచి పోయింది. భోజనం అయ్యాక నేనే అడిగేను శేఖర్ ఎప్పుడు వస్తున్నాడని

"తెలీదు." అందామె పైట కొంగుతో చేతులు తుడుచుకొని కూర్చుంటూ

"ఉత్తరాలు వస్తున్నాయా?"

"ఆఖరు వుత్తరం వచ్చి రెండు సంవత్సరాలయింది" కొంచెం ఆగి చెప్పింది. ముఖంలోకి కొంత తీవ్రత వచ్చింది. కంఠంలో నిరుత్సాహం ధ్వనించింది.

నామటుకు నాకు శేఖర్ వ్యక్తిత్వంమీద వాడి గొప్ప ఆలోచనలమీదా ఏమాత్రం సందేహం లేదు. అంతగా ఆరాధించిన ఆమెకు నాకంటె దృఢమైన విశ్వాసం ఉండి వుంటుంది. అయినా రెండేళ్ళుగా ఉత్తరం వ్రాయలేదంటే నా ఆలోచన పరిపరివిధాల పోయింది మనసులో మాట పైకంటే భానుమతి మనసు నొప్పించిన వాణ్ణవుతానేమోనని భయపడ్డాను. కాని ఆ దృష్టితో ఆలోచించడం ఆమెకు కూడా కొంత అవసరం లేకపోతే ముందు తగిలే గాయం ఎటువంటిదైనా భరించడం కష్టంకావచ్చు

"నువ్వేమీ అనుకోకపోతే శేఖర్ నుంచి నువ్వు ఏమి ఆశిస్తున్నావ్?"

భానుమతి నా ప్రశ్న విని రెప్ప వాల్చకుండా నా కళ్లల్లోకి చూసింది బరువుగా ఊపిరి పీల్చింది ముఖంమీద నిగ్రహంతో ఏర్పరచుకున్న ఒక స్థిరత్వం కనబడుతూంది.

"ఇంకొంచెం సూటిగా అడగకూడదూ ఆ ప్రశ్న ?"

"నేను అడిగింది అర్థంకాలేదా?"

"అర్థం అయిందని నే ననుకుంటున్నాను అయినా నే ననుకున్న ఆలోచన నీ ప్రశ్నలో లేకపోతే నా జవాబు అసందర్భం అవుతుందేమోనని."

"శేఖర్ తిరిగివచ్చి నిన్ను పెళ్లిచేసుకోవాలని అనుకుంటున్నావా?"

"యస్! అది అతను అమెరికా వెళ్లేముందు

మేమిద్దరం చేసుకున్న నిర్ణయం..." సరిగా అప్పుడే లైట్లువచ్చేయి. గదంతా వెలుగుతో నిండిపోయింది. ఓసారి ఆమె చుట్టూ చూసి మళ్లీ చెప్పింది.

"...కాని అతను ఆ నిర్ణయానికి కట్టుబడి ఉండనక్కర్లేదు. ఎందుకంటే యీ రోజు అతను చూడగలిగిన విశాల ప్రపంచంలో అతని మేధాసంపత్తికి సరితూగే మరొక స్త్రీ అతనికి తారసపడి వుండొచ్చు. ఏమయినా జీవితంలో ఒకరితో వివాహం వారితో కాలం వెళ్లబుచ్చడం అనేది మిగిలిన వాటి అన్నింటికంటె ముఖ్యమయిందికాదు. ఓ ఆదర్శంలో కాని, దాన్ని సాధించడానికి మనసులోరగిలే ఆవేశంలో కాని అతనికి నేను సరితూగను. కాని నాకు అతను కావాలి. అతను అనుక్షణం ప్రజ్వరిల్లే నిప్పులాంటి మనిషి. నాకు అతను చూపించిన జీవితంలోని అమూల్యమయిన విలువలను సంపాదించడానికి అతని ప్రోత్సాహం, సలహా, సహాయం కావాలి. నాన్నగారు పోవడం అతని దగ్గర్నుంచి ఉత్తరాలు ఆగిపోవడం యించుమించుగా ఒకేసారి జరిగేయి. కొత్తలో ఆ ఒంటరితనం ఎంత భయంకరంగా వుండేదో నేను తిరిగి మాటల్లో చెప్పలేను... ఆతనికోసం కళ్లల్లో ఒత్తులు పెట్టుకొని ఎదురు చూస్తున్నాను!"

భావావేశం తొణికిసలాడుతూన్న ముఖంతో, సుందరమైన భంగిమలో, నిర్దుష్టమైన ఆమె విగ్రహం అప్పుడే వచ్చిన కొత్త వెలుగులో దివ్యమైన దేవతామూర్తిలా గోచరించింది.

ఎన్నోసార్లు నేను రెండు డిగ్రీలు సంపాదించేననీ, నాలుగంకెల జీతం తెచ్చుకుంటూన్న ఆఫీసరుననీ; జీవితంలో ఏదో బాగా సాధించేననీ అనుకున్నా ఆ క్షణంలో ఆమె ముందు మగవాడినైయుండి ఏదో నాలుగురాళ్లు తెచ్చుకుని పొట్టపోసుకుంటూ జడమైన జీవితాన్ని గిడుపుతూన్న అల్పుడుగా నాకు నేనే కనబడ్డాను. మళ్లీ కలుస్తానని ఆమెతోచెప్పి రాత్రి పదిగంటలకు మా లాడ్జికి బయలుదేరేను.

ఆ తరువాత అక్కడున్న నాలుగు రోజుల్లోను వీలయినన్నిసార్లు భానుమతిని చూసేను. ఆమె సొంత యింటికి వెళ్లి అక్కడామె స్కూలు పెట్టడానికి చేస్తున్న ఏర్పాట్లన్నీ చూసేను. స్కూలు ఎలా నడుపదలచుకున్నదీ, పేద విద్యార్థులను ఎలా ఎన్నుకోదలచినదీ, వాళ్లకు చదువుతోపాటు చక్కని శీలాన్ని ఎలా పెంపొందించదలచుకున్నదీ చెప్తూంటే ఆసక్తిగా విన్నాను. ఆ వయస్సులో తన వ్యక్తిగతమైన సుఖాలను మించి వీటిని గురించి అంత తీవ్రంగా ఆలోచించగలిగినందుకు మనస్ఫూర్తిగా అభినందించేను. ఆమె ప్రయత్నం నన్ను ఎంత ఉత్తేజపరచిందంటే ఆఖరిరోజు కలిసినప్పుడు "ఇంత శ్రద్ధతో నువ్వు నిర్వహిస్తున్న పనికి నేను ఎటువంటి సలహా యివ్వడానికి తగను. కాని నావలన ఎప్పుడు ఎటువంటి సహాయం కావాలన్నా ఆర్థికంగా కూడా నాకు చేతనయింది చెయ్యడానికి ఎదురు చూస్తూంటాను" అన్నాను. నా మాటలు భానుమతికి చాలా సంతోషం కలిగించేయి.

"యు ఆర్ ది సేమ్ స్వీట్ ఫెలో! మారలేదు కాంతీ!" అంది ఆర్ద్ర హృదయంతో.

* * *

టాక్సీలో కూర్చొని "మలబార్ హిల్స్"లో ఎడ్రసు చెప్పేను. బొంబాయిలో ఆ భాగం అప్పటివరకూ నేను చూడలేదు. వీధులకు రెండు వైపులా స్కైస్క్రేపర్స్ ఇంగ్లీషు నవలల్లోని న్యూయార్కు పట్టణ వీధుల్లోలా ఉన్నాయి.

మనసులో ఆలోచనలు ఇంకా గాలిలో తేలుతూన్నట్లుండగానే టాక్సీ మేఘాలను తాకుతూన్నట్లున్న ఓ భవనం ముందు ఆగింది. పదహారు రూపాయలు డ్రైవరు చేతిలో పెట్టి క్రిందికి దిగేను. ఎదురుగా ఉన్న 'ఆకాశ్‌దీప్' బిల్డింగ్ చూసేసరికి గుండె వేగం ఎక్కువయింది. ఆ పరిసరాల్లో శేఖర్‌ను చూడడానికి ఎందుకో మనసుడెక్కుతూంది. బెదురుతూనే బిల్డింగ్‌లోకి వెళ్లి లిఫ్టుబెల్ నొక్కేను. కొద్ది సెకన్లలో లిఫ్టు తలుపు తెరుచుకుంది. లోపలకు వెళ్లి పంధొమ్మిది నంబరు బటన్ నొక్కగానే తలుపు మూసుకుంది. ఎంతసేపయినా లిఫ్టు కదులుతూన్నట్టు లేదు. ఏమయినా చెడిపోయిందేమోనని ఏం చేద్దామా అని తలుపు తీయబోతే అదే తెరుచుకుంది. గౌను తొడుక్కున్న ఎర్రటి ముసలావిడ ఎదురుగా నిలబడింది. కొంచెం ఖంగారు పడ్డాను.

"క్రిందికి వెడుతున్నావా" ఇంగ్లీషులో అడి...

"పందొమ్మిదవ అంతస్థుకు వెళ్లాలి." అని జవాబు చెప్పేను.

"ఇది పందొమ్మిదవ అంతస్థే" అందావిడ.

"ఓ! ఐసీ!" ఖంగారుగా బయటకు దూకేను. ఆవిడ లిఫ్టులో వెళ్లిపోయింది.

ఒక్క క్షణం ఆగి రుమాలు తీసి ముఖం తుడుచుకొని టైము చూసేను. సరిగా నాలుగున్నర అయింది. రాజుగారి సన్నిధికి వెళ్లే సేవకుడిలా కరెక్టుగా టైముకి ఖంగారు పడుతూ... నా మానసిక స్థితి నాకే అసహ్యమనిపించింది. శేఖర్... ఒకప్పుడు తినడానికి తిండి లేక తన దయతో ఆకలి తీర్చుకున్న శేఖర్, తను చందాలు పోగుచేస్తే జీతం కట్టి చదువుకున్న శేఖర్... ఎదురుగా డాక్టర్ పి. సి. శేఖర్ అని బోర్డు చూసేసరికి ఆలోచనలన్నీ ఎగిరిపోయి మళ్లీ దడ ప్రారంభం అయింది.

కాలింగ్ బెల్ బటన్ నొక్కేను.

తలుపు తెరుచుకుంది. ఎదురుగా దబ్బపండు లాంటి ముసలాయన చారల పైజామా లాల్చీలో ఉన్నాడు. దుబ్బుల్లా ఉన్న కనుబొమలు పైకెత్తి కళ్ళల్లోకి చూసేడు.

"డాక్టర్ చంద్రశేఖర్!"

"ప్లీజ్ కమిన్!" అని నేను లోపలకు వెళ్లగానే తలుపు మూసి శేఖర్‌ను పిలచేడు.

ప్రక్కగదిలోంచి శేఖర్ బయటకువచ్చి చూసి "నైస్ సీ యూ! కమిన్!" అని లోపలకు దారితీసేడు. వాడి వెనకాలే నేనూ నడిచేను. క్రింద పాలరాతి గచ్చు. గోడలకు నాలుగడుగుల మేరకు పాలిష్‌చేసిన పేనల్ వుడ్. ఆపైన ఎక్కడా మరక లేకుండా స్పాంజి ముక్కలు నిలబెట్టినట్లున్న లేత రంగుల్లో గోడలు. వాటికి చక్కగా అమరిన అందమైన ఆధునిక వర్ణ చిత్రాలు.

విశాలమయిన ప్రక్క గదిలో మధ్యలో వేసిన అందమయిన తివాచిమీద రెండు ఖరీదైన సోఫా సెట్లు. సోఫాల్లో శేఖర్‌కాక మరొకతను, యింకో యిద్దరు ఆడవాళ్లు. పరస్పరం పరిచయాలు చేశాడు. సోఫాలో కూర్చున్నాక టీపాయ్‌మీద చూసేను. నేతిలో వేయించి మిరియాల పొడి జల్లిన జీడిపప్పు. అందమైన గాజు మగ్స్‌లో నురుగులు తేరి వున్న బీరు. శేఖర్ యింకో మగ్ తీసుకొని నా ముందు పెట్టి ఫ్రిజ్‌లోంచి యింకో బీర్ బాటిల్ తీసేడు.

నేను అప్పుడూ అప్పుడూ బార్‌కు స్నేహితులతో వెళ్లినా ఎందుకో అక్కడ వాళ్లమధ్య తీసుకో బుద్ధి కాలేదు.

"నో థాంక్యూ!" అన్నాను.

"ఓ!" అని ఓసారి అదోలా కళ్లల్లోకి చూసి "హేవెకోక్!" అని కోకాకోలా తీసుకొచ్చి నాముందుంచేడు. అంతకు ముందు వాళ్లతో ఏదో మాట్లాడుతున్నట్లున్నాడు. ఉన్నట్లుండి ఇంగ్లీషులో మొదలుపెట్టేడు. "...అందుకని నాకు కావలసింది ఒక ఉదాహరణ, వర్గంలేని సమాజం ఎక్కడుంది? ఎప్పుడుంది?... మీరు చెప్పినట్లు పోనీ ఆ కమ్యూనిస్టు ప్రపంచంలో వుందా?... అది వట్టి భ్రమ. అక్కడ డబ్బు తెచ్చిపెట్టిన వర్గాలు లేకపోవచ్చు. కులం ఏర్పరచిన వర్గాలు లేకపోవచ్చు! అదృశ్యంగా వున్న పార్టీ రూపంలో అధికార రూపంలో వర్గాలున్నాయి అక్కడ. ఈ వర్గాలు పై రెండింటికంటె ప్రమాదకరమయినవి. ఈ వర్గమనేది సృష్టి స్వభావం. తెలుపు—నలుపు, వెలుగు—నీడ. వీటిని మనం రూపుమాపలేం... ప్రపంచంలో అందరూ సమానంగా ఉండాలి. ధనికుడు, పేదవాడు అనే మాటలు డిక్షనరీలో వుండకూడదు. ఇవన్నీ సమకూరే క్షణాలు వున్నాయని మీ రనుకుంటున్నారా?... సూర్యుడు పడమట ఉదయిస్తాడంటే ఒప్పుకోడానికి నా కభ్యంతరం లేదు. కాని ఏభేదమూలేని సమాజం గతంలో లేదు. భవిష్యత్తులో వుండదు. అది జరిగితే గాలి స్తంభించిపోతుంది. కాలం నిలిచిపోతుంది. రోడ్డు వేసేవాడులేదు. రోడ్డు తుడిచేవాడు లేదు. ఫాక్టరీలో పని చేసేవాడు లేదు. మొక్క నాటేవాడు లేదు... అటువంటి రోజుల్లో అసలు

'ఈ కాలపు పిల్లలు'లో ప్రభ, రామకృష్ణ



## రాజబాబు నవ్వితే ప్రభ చెక్కిలి ఎరుపెక్క!

## ★ సినిమా విశేషాలు ★

"హాస్య రాజు" బాబును, ధనవతి ప్రభ గాఢంగా ప్రేమించింది. ఆమెను ప్రతి క్షణం నవ్విస్తూ, ఆమె అందాన్ని తదేకంగా చూస్తూ, పరవశిస్తున్నాడు, రాజబాబు.

అతడి చూపులకు, అతడి నవ్వుల పలుకులకు ప్రభ పుక్కిరిబిక్కిరయ్యింది.

మనసులోని మోహాన్ని చెప్పలేక, చెపుదామంటె మాట రాక తటపటాయించింది. మాటలతో చెప్ప లేని నిజాన్ని, పాట రూపంలో తెలియచేసింది. ఎలాగో తెలుసా?

"పకపక నువు నవ్వితే
నా చెక్కిలి ఎరుపెక్కుతుంది
చిలిపిగ నువ్ చూస్తే
నా కళ్లకు కైపెక్కుతుంది" అంటూ

రాజబాబును సమీపించింది. అదను చూచి, ఆమెను దగ్గరకు తీసుకున్నాడు రాజబాబు. పాటను కొసరాజు వ్రాయ, సుశీల గానం చెయ్య, చలపతిరావు సంగీతం సమకూర్చారు.

ఈ నవ్వుల ప్రణయం ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి "అల్లుడొచ్చాడు" చిత్రంలో కనిపిస్తుంది. మంచి చిత్రాల నిర్మాత ఎ. వి. సుబ్బారావు నిర్మించ, ఉత్తమ చిత్రాల దర్శకుడు ప్రత్యగాత్మ దర్శకత్వం నిర్వహించారు. నవయుగ విడుదల.



'అల్లుడొచ్చాడు'లో రాజబాబు, ప్రభ

ఉండగలిగేది మాత్రం ఏముంది!... ఈ సమత్వ వాదాలన్నీ ప్రకోపించిన మేధావుల మెదడులో చిత్రించుకున్న ఊహాగానాలు... అందుకని వర్గాలు ఉన్నాయి. అవి ఎప్పుడూ ఉంటాయి. లేస్తున్న కెరటపు టంచుమీదికి పోయి నిలవడాని ప్రతి నీటి బొట్టుకూ అవకాశం ఉంది. అట్టడుగుకు దిగిపోవ డానికీ అవకాశం ఉంది. చివరకు ఒకటే నిజం. వ్యక్తిగతంగా ఎవడికివాడే అత్యున్నత స్థానానికి పోవ డానికి జీవితాన్ని ఒడ్డి ప్రయత్నించాలి. వాడనుకున్న చోటికి వాడు చేరలేకపోతే అది వాడి ప్రయత్న లోపం. కాని సమాజానికి కాదు..."

ఆ మాటలతో భానుమతి అక్కడ లేదన్న విషయం నాకు స్పష్టమయిపోయింది. ఎనిమిదేళ్ళ క్రితం నా రూమ్‌లో మాట్లాడిన శేఖర్‌ను వాడి స్థానంలో నిలబెట్టి చూసేను. అదే ఆవేశం! అదే వాగ్ధోరణి! మిగిలిన ముగ్గురూ నాగస్వరం వింటూన్న పాముల్లా తలలాడిస్తూ కూర్చున్నారు. శేఖర్ ముందు నాకు తెలిసి ఉండకపోతే వాడి వాదం లోని లోపం నాకు కనిపించి ఉండకపోవచ్చు. ఇప్పుడు వాడి మాటలు వింటూంటే తల తిరుగుతూన్న ట్లుంది. తరువాత వాడేమి మాట్లాడిందీ నా తలలో కెక్కలేదు. నేను ఆ పాముల వైపు చూస్తూ కూర్చున్నాను.

ఓ అరగంట తరువాత నేను ఇబ్బందిగా కదులుతూంటే నన్ను చూసి కొంచెంసేపట్లో వస్తా నని వాళ్ళతో చెప్పి నన్ను ప్రక్క గదిలోకి తీసు కెళ్లేడు.

"ఏమిటోయ్ కాంతి విశేషాలు?" అన్నాడు.

"స్టేట్స్ నుంచి ఎప్పుడు వచ్చేవ్?" అని అడిగేను.

"ఏడాది దాటిందనుకుంటాను..." అన్నాడు. "...అసలు రాకూడదనే అనుకున్నాను. నువ్వు

## సూర్యుణ్ణి చూసిన కళ్లు

పెంచుకున్న విజ్ఞానానికి ఏమిటి ఇక్కడ ప్రతిఫలం. అక్కడ నీ మెదడు ఉపయోగిస్తూంటే జీవితంలో చివరి రోజుదాకా నువ్వు ఒక్కో కొత్త మెట్టు ఎక్కవచ్చు. కాని అనుకోకుండా నాకు ఈయన... నువ్వు వచ్చినప్పుడు తలుపు తీసినాయన... బిజినెస్ ట్రిప్ మీద అక్కడికి వచ్చినప్పుడు కలిసేరు. ఇక్కడ ఈయనకు మందుల ఫాక్టరీలూ, రంగుల ఫాక్టరీలూ ఉన్నాయి. టెక్నికల్ డిపార్టుమెంటూ, మేనేజి మెంటూ రెండూ నా చేతిక్రింద పెడతానని బల వంతం చేసి తీసుకొచ్చేరు... అది సరే! నీతో ముఖ్యంగా ఒక విషయం మాట్లాడాలని ఇక్కడికి పిలిపించేను...

భానుమతి గుర్తుంది కదూ నీకు?" అన్నాడు.

ఆ ప్రశ్న నాకు చాలా కోపం తెప్పించింది. జవాబు చెప్పబుద్ధి కాలేదు. అయినా ఎంతవరకు వెడతాడోనని "ఊ" అన్నాను.

"ఏంలేదు. నీతోకూడా ఆమె చనువుగా వుండేది. ఆర్థికంగా నాకు కొంత సాయపడింది. ఆమెకు ఋణపడివుండాలని లేదు. ఆమె దగ్గర తీసుకున్న డబ్బు తిరిగి యిచ్చేద్దామని వుంది. నాకు వెళ్లే వ్యవధీ అవకాశం లేవు. పోస్టులో పంపితే ఆమెకి నచ్చకపోవచ్చు... నువ్వు నాకు యీ చిన్న సాయం చేసిపెట్టాలి..."

"ఏమిటి?"

"నేను డబ్బు నీకిస్తాను. ఆమెకు బాధ కలగ కుండా తిరిగి అందజెయ్యాలి."

మనసంతా నిండిపోయిన జుగుప్సతో నాకు మాటరాలేదు. అయినా దాచుకోలేక సూటిగా కళ్ల ల్లోకి చూసేను.

"ఒక్క నిముషం!" తల ప్రక్కకు త్రిప్పు కొని లోపలకు వెళ్లేడు. చికాగ్గా బయటకుచూసేను.

సముద్రం నేలా చేసుకున్న వంకరటింకర సంధులు కనబడుతున్నాయి.

శేఖర్ మనసులోంచి పోవటంలేదు. వాడో అంద మైన రంగు సీసా! అందులో పన్నీరు పోసినా పేడ నీళ్లు పోసినా మూత తెరచేదాకా ఒకలాగే కనబడు తుంది. వాడో మంచి వక్త. వాడికి హృదయంలేదు. వాడికి నీతి లేదు. భానుమతి మనస్సులో మెదిలింది. తలెత్తి దూరంగా చూసేను. ఆమె నిస్వార్థమైన వినిర్మలమైన ప్రేమ యొక్క పరిపూర్ణత్వాన్ని ఆలో చిస్తూ పడమటి దిక్కున మేఘంలేని ఆకాశంలో పసిడికాంతులతో వెలిగిపోతూన్న సూర్య బింబాన్ని రెప్ప వాల్చకుండా చూస్తున్నాను.

శేఖర్ వచ్చినట్లున్నాడు. నేను తల తిప్పలేదు. వాడు చెప్పదలుచుకున్న దేదో గొంతుదాటి రావటం లేదు. నా దృష్టిని ఆకర్షించడానికి అన్నట్లు ఓసారి దగ్గి... "ఈ రింగ్ చూసేవా? రాయి ఖరీదు పది హేనువేల రూపాయలు. మొన్న మా ఎంగేజ్‌మెంట్ నాడు రోహిణి నా వ్రేలికి తొడిగింది."

ఉలిక్కిపడ్డాను. నా గుండెలో సూది గుచ్చు కున్నట్టయింది. రోహిణి... ప్రక్కగదిలో పాలరాతి బొమ్మ... రంగుల ఫ్యాక్టరీ యజమాని ఏకైక పుత్రిక. తల తిప్పి చూసేను.

సూర్యుణ్ణి చూసిన కళ్లకి వాడు ముందుకు చాచిన చేతినున్న అంత ఖరీదయిన వుంగరం జాడే తోచలేదు. కాని చేతిలోనున్న డబ్బు ప్యాకెట్ అస హ్యంగా కనబడుతూంది. హఠాత్తుగా అటువంటి మనిషితో మాట్లాడడమే నీతి లేకపోవడమేమో నని పించింది. వేగంగా బయటికొచ్చేసేను. 'కాంతీ!' అని శేఖర్ నా వెనకాలే రాబోయేడు. వాడి పిలుపును నా వెనకాల నేను మూసిన ఆ కోటీశ్వరుడి ఇంటి తలుపు పుటుక్కున తుంచేసింది.

(అయిపోయింది)

P is for Podar Textiles
Look for it when you want to look this good









**PODAR textiles**

***suitings ★ shirtings and sarees***

RADEUS-PT-1



◄ 'మావూరి కథ'లో జయప్రద, కృష్ణ

# సినిమా

### ద్విపాత్రాభినయంలో భిన్నత్వం

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న వర్ణ చిత్రంలో శోభన్ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ కాగలదు. ద్విపాత్రాభినయంలో భిన్నత్వం వున్న నిజాన్ని, హీ—మాన్ చెప్పారు.

చిత్ర నిర్మాత త్రివిక్రమరావుగారు వుత్తమ అభిరుచులు వున్నవారని, చిత్ర నటీనటులు, టెక్నీషియన్లు పదే పదే ప్రశంసించడం నా చెవులారా విన్నాను. దర్శకుడు టి. కృష్ణ తనకు మాణిక్యం లాంటి నిర్మాత లభించినందుకు సంతోషాన్ని ప్రకటించారు.

### తారాబలం !

త్రివిక్రమరావుగారి వర్ణ చిత్రంలో శోభన్, మంజుల, జయసుధ, రాజబాబు, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, అంజలీదేవి వంటి ప్రముఖులు వున్నారు. మహదేవన్, రాము, సత్యానంద్ వంటి వుద్దండులు వున్నారు.



'జ్యోతి'లో జయసుధ

### హీరోకు ప్రశంస

హీరో పాత్రధారి శోభన్‌బాబుగారు తనకు సంపూర్ణ సహకారాన్ని యిస్తున్నందుకు, నిర్మాత కృతజ్ఞతలు తెలుపుతున్నారు.

### అనిల్ ప్రొడక్షన్స్ ఆరంభం

ఫిబ్రవరి అయిదున, అనిల్ ప్రొడక్షన్స్‌వారి వర్ణ చిత్రం ఆరంభమైంది. "నటరత్న" క్లాప్ కొట్టగా, తారకరామ శేషగిరిరావు స్విచ్ ఆన్ చెయ్యగా, మొదటి షాటు శోభన్‌పై చిత్రీకరించబడింది.

అగ్రశ్రేణి దర్శకుడు తాతినేని ప్రకాశరావు సృష్టించిన కొత్త తరహా పాత్రను, శోభన్ పోషిస్తున్నారు. కథానాయికగా వాణిశ్రీ నటించగా, సహాయ పాత్రలను సత్యనారాయణ, గుమ్మడి, రాజబాబు, మిక్కిలినేని, అల్లు రామలింగయ్య, రాజేశ్వరి పోషిస్తున్నారు.

తారకరామ సంస్థలో శోభన్ నటిస్తున్న మొదటి చిత్రం యిదే అవుతుంది. భమిడిపాటి కథ, మాటలను, మహదేవన్ సంగీతాన్ని, వెంకటరత్నం ఛాయను, సూరన్న కళను, పాణి సహ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ఈ చిత్రానికి ప్రకాశరావు దర్శకుడు. చిరంజీవి టి. ఎల్. వి. ప్రసాద్ నిర్మాత.

ఆగస్టు 15న, అనిల్ ప్రొడక్షన్స్‌వారి చిత్రం విడుదలవుతుంది.

### దాసరి చిత్రంలో విజయలలిత

"డైరెక్టర్ ఆఫ్ ది డే" అని దాసరిని ప్రజలు అంటున్నారు. వారిచేత అలా కీర్తింపబడుతున్న గడుసరి ప్రతి చిత్రంలో ఏదేని కొత్తదనాన్ని జనామోదం పొందే విధంగా చూపెడుతున్నారు.

"వాంప్ పాత్రలు వద్దు" అని నిర్ణయం తీసుకున్న విజయలలిత నటిగా ఎట్టి పాత్రకయినా న్యాయం చెయ్యగల సమర్థురాలు అనేడి నమ్మకం దాసరికి వుంది.

"బంట్రోతు భార్య" చిత్రంలో కలెక్టర్ భార్య పాత్ర విజయలలిత పోషించడం సాధ్యపడలేదు.

విజయలలిత నట జీవితంలో మైలురాయిగా నిలిచేపోయే పాత్రను దాసరి ఒక చిత్రంలో సృష్టించారు.

### భారతనారి వర్ధిల్లు

ఆ చిత్రం పేరు "భారతనారీ వర్ధిల్లు" మురళీమోహన్, విజయలలిత ప్రధాన జంటగా నటిస్తారు.

### తూర్పు.. పడమర తారాగణం

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న (హైద్రాబాద్‌లో) "తూర్పు...పడమర" చిత్రంలో పాల్గొనే నటీనటుల ఎంపిక పూర్తయింది.

చిత్రంలో ప్రధాన పాత్రలు వున్నవే అయిదు. ఆ పాత్రలను సత్యనారాయణ, జయలక్ష్మి, శ్రీవిద్య, నరసింహరాజు, చలం పోషిస్తున్నారు.

"స్వర్గం... నరకం" చిత్రంలో జయలక్ష్మి ధరించిన పాత్రకు, "తూర్పు...పడమర" చిత్రంలో జయలక్ష్మి ధరించనున్న పాత్రకు స్వభావంలో ఎంతో తారతమ్యం వుంది. జయలక్ష్మికి మరొకసారి పేరు తెచ్చే పాత్రను, దాసరి యిచ్చారు.

సంగీతానికి రమేష్‌నాయుడు, ఛాయాగ్రహణానికి కె. ఎస్. మణి అధిపతులు.

దాసరి హిట్ లిస్టులో "తూర్పు... పడమర" చిత్రం చోటు చేసుకుంటుంది.



'ప్రేమబంధం'లో వాణిశ్రీ, శోభన్‌బాబు



'అర్థాంగి'లో ఒక దృశ్యం

## బిజీ చలం!

హాస్య పాత్రలను పోషించడానికి చలం సుముఖంగా వున్నారని తెలిసిన మరుదినం నుంచి, నిర్మాతలు ఆయన్ను అట్టి పాత్రల కోసం ఎంపిక చేస్తున్నారు.

దర్శకుడు కె. ఎస్. రెడ్డి చలంకు "సీతమ్మ సంతానం" చిత్రంలో ద్విపాత్రాభినయం యివ్వడం, శుభ యోగానికి దారితీసింది.

లక్ష్మి ఫిలిం ఆర్ట్స్ నిర్మిస్తున్న "దేవుడు చేసిన బొమ్మలు" చిత్రంలో చలం విచిత్రమైన పాత్రను పోషిస్తున్నట్టు, దర్శకుడు హనుమాన్ ప్రసాద్ చెప్పారు.

నిర్మాత రాఘవ, దాసరి దర్శకత్వంలో నిర్మిస్తున్న "తూర్పు... పడమర" చిత్రంలో చలం పెక్యూలియర్ పాత్రను పోషిస్తున్నారు.

మరో ఆరుగురికి చలం హాస్య పాత్రలకు అంగీకారం తెలిపారు.

చలం తీసుకున్న సముచిత నిర్ణయాన్ని, సమయస్ఫూర్తిని అందరూ అభినందించకమానరు.

## శీలానికి శిక్ష

ఫిబ్రవరి పదకొండు, దాని తరువాతి రోజు చాలా మంచి రోజులని, సావరిన్ సినీ ఎంటర్ ప్రైజెస్ అధినేత శర్మ "శీలానికి శిక్ష" చిత్రానికి సంబంధించిన మూడు పాటలను రికార్డ్ చేశారు.

ఆంధ్రుల అభిమాన సంగీత దర్శకుడు మహదేవన్ ముచ్చటయిన మూడు పాటలకు మధుర స్వరాలను సమకూర్చారు. రామకృష్ణ, బాలు, సుశీల, ఈశ్వరి మనోజ్ఞంగా పాడారు.

"శీలానికి శిక్ష" చిత్రం షూటింగు మార్చి ఒకట్నుంచి ఏప్రిల్ చివరిరోజు వరకు నిడదవోలులో ఏక ధాటిగా జరుగుతుంది. రామకృష్ణ, శారద, జయసుధ, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, రమాప్రభ, పుష్పకుమారి,శర్మ ప్రధాన పాత్రలనుపోషిస్తున్నారు.

"స్త్రీ"లను విశేషంగా ఆకట్టుకునే "శీలానికి శిక్ష" చిత్రానికి గొల్లపూడి రచన్ను, లక్ష్మణగోరే ఛాయాగ్రహణాన్ని, నిర్వహిస్తున్నారు. వర్తె వున్న డి. ఎస్. ప్రకాశరావు యీ చిత్రానికి దర్శకుడు. శ్రీ ఫిలింస్ విడుదల.

## జయచిత్రాలయ పిక్చర్స్

హైద్రాబాద్ వాస్తవ్యులు నాగేందర్, రవి స్థాపించిన యీ సంస్థ సారధీ స్టుడియోలో ఒక సాంఘిక చిత్రాన్ని ఏప్రిల్ చివరన ప్రారంభిస్తుంది.

"సంబరాల రాంబాబు, సిపాయి చిన్నయ్య, అమ్మాయిల శపథం" వంటి మంచి చిత్రాల దర్శకుడు జి. వి. ఆర్. శేషగిరిరావును జయ చిత్రాలయ పిక్చర్స్ తమ దర్శకుడుగా ఎన్నుకున్నారు.

పై సంస్థ నిర్మిస్తున్న చిత్రంలో మురళీ మోహన్, జయసుధ, రమాప్రభ, కృష్ణకుమారి, కాంతారావు ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

జి. వి. ఆర్. కు సహకరించే సాంకేతిక శాఖలను రాజేశ్వరరావు, (సంగీతం) జి. కె. రాము, (సంభాషణం) హరి (ఛాయాగ్రహణం) నిర్వహిస్తున్నారు.

ఈ చిత్రంలోని సింపతీ రోల్‌ను కొత్తమ్మాయి పోషించగలదు. ఈ చిత్రానికి సంబంధించిన నాలుగు పాటలు రికార్డు చెయ్యబడ్డాయి.



'భక్త కన్నప్ప'లో సారధి, కృష్ణంరాజు



## లక్కీ జయప్రద!

వెండితెరను ఆక్రమించిన కొద్దిమందిలో (సమర్థులు) జయప్రద ఒకర్తె. ఈమెను అదృష్ట దేవత ఎంతగా వరించిందంటె, విశిష్టమైన పాత్ర లన్నీ యీమెకు వస్తాయి అన్నంతవరకు.

జయప్రదకు పేరు తెచ్చే చిత్రాలు: విశ్వనాధ్ గారి "మాంగల్యానికి మరో ముడి, బాపుగారి సీతా కళ్యాణం, బాలచందర్‌గారి అంతులేని కథ."

గీతాకృష్ణ కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో మార్చి 14 వ ప్రారంభిస్తున్న చిత్రంలో జయప్రద మరొక మరపురాని పాత్రను పోషించే అదృష్టాన్ని దోచుకుంది.

గోదావరి తీరాన జరిగే యీ చిత్రానికి కథ కథనం, దర్శకత్వం విశ్వనాధ్‌గారు సమకూరుస్తున్నారు. మాటలను సుందరంగా రాసే బాధ్యతని రామమూర్తి స్వీకరించారు. సంగీతానికి మహదేవన్ ఛాయాగ్రహణానికి స్వామి సారధులు.

ప్రధాన పాత్రలను చంద్రమోహన్ సత్యనారాయణ, రమాప్రభ, అల్లు రామలింగయ్య దేవదాస్ పోషిస్తున్నారు.



'సీతా కళ్యాణం'లో జయప్రద

## రామకృష్ణ గంభీర గానం

వర్ధమాన వర్ధి గాయకుడు రామకృష్ణ పద్మాలయా కంబైన్స్‌వారి "స్వర్గానికి నిచ్చెనలు" చిత్రానికిగాను ఒక గొప్ప పాటను, ఎంతో గంభీరంగా పాడారు.

"ఆశే మనిషిని తరిమేది
ఆశే మనసును చెరిచేది
ఆశ... ఆశ... ఆశ"

ఈ పాటను ఆచార్య ఆత్రేయ ఎంత భావ గర్భితంగా రాశారో, అంత ఆవేశయుక్తంగా రామకృష్ణ పాడారు.

స్వర్గీయ ఘంటసాల యిలపై వుండివుంటె, చిరంజీవి రామకృష్ణను మనసారా దీవించి వుండేవారు.

తెలుగు ఫిలిం పత్రికా సంపాదకుడు రామచంద్రన్, తమిళ రచయిత పంజు అరుణాచలం గార్లు నిర్మిస్తున్న "స్వర్గానికి నిచ్చెనలు" చిత్రంలో రామకృష్ణ, జయచిత్ర, ప్రభ, చంద్రమోహన్, నిర్మల ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

సంగీతాన్ని మహదేవన్, రచన్ను సముద్రాల, కళను కళాధర్ నిర్వహిస్తున్నారు. ఈ చిత్రానికి ఎన్. గోపాలకృష్ణ దర్శకుడు. తారకరామ విడుదల.

## రామకృష్ణ వున్నత నటన

అనంతలక్ష్మి కంబైన్స్ "భిన్న ధృవాలు" నవలాధారంగా నిర్మించిన "ఈ కాలపు పిల్లలు" చిత్రాన్ని యీ విలేఖరి చూశాడు. ఈ మధ్య కాలంలో యింత విడివి తక్కువ చిత్రం యిదేనేమో అనిపించింది. మామూలు చిత్రాలకు "ఈ కాలపు పిల్లలు" చిత్రానికి భిన్నత్వం గోచరించింది.

విద్యాదానం చేసే కళాశాల వుపన్యాసకుడుగా, వివేకాన్ని బోధించే వుత్తముడుగా రామకృష్ణ నటన

# సినిమా

వున్నతంగా, హుందాగా, విందుగా వుంది. నాయిక శాంతిగా ప్రభ, లారీ డ్రైవరుగా (ఆలీబాబా) ప్రభాకరరెడ్డి చక్కగా నటించారు.

దుష్టపాత్రను (సాగర్) దేవదాస్ ఎంతవరకు చెయ్యాలో, అంతే చేశారు.

"ఈ కాలపు పిల్లలు" చిత్రానికి సత్యానంద్ కలం (సంభాషణలు) ఎంతో వుపకరించింది. సంభాషణలు వుపన్యాస ధోరణిలోగాక, వినే విధంగా వున్నాయి.

పాటల్లో కొసరాజుగారి "లారీ... లారీ" పాట పదే పదే పాడాలనిపిస్తుంది. దర్శకుడు లక్ష్మీదీపక్ చిత్రాన్ని సారస్యంగా నడిపించారు. నిర్మాత భాస్కరరావు. విడుదల అన్నపూర్ణ.

## మార్చిలో పద్మాలయా కొత్త చిత్రం

ప్రేక్షకులు యిష్టపడే చిత్రాలను నిర్మించే మేధస్సు పద్మాలయా సంస్థకు వుంది.

"పాడి పంటలు" ప్రజలకు నచ్చింది. కృష్ణ నటనకు మంచి పేరు వచ్చింది.

మార్చిలో పద్మాలయా సంస్థ మరొక అపురూపమయిన చిత్రాన్ని తలపెట్టింది.

## రామరాజ్యంలో రక్తపాతం

చిత్రం పేరు ఎంత గొప్పగా వుందో చూశారా? ఈ చిత్రంలో కృష్ణ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ. కధను, సినిమా అనువాదాన్ని పి. సాంబశివరావు (అర్ధరాత్రి ఫేమ్) నిర్వహిస్తారు. వెండితెర ప్రముఖులందరూ యీ చిత్రంలోని ప్రధాన పాత్రలను పోషించగలరు. రచనకు మోదుకూరి జాన్సన్, సంగీతానికి మహదేవన్, ఛాయాగ్రహణానికి పుష్పాల, కూర్పుకు కోటగిరి గోపాలరావు సారధ్యం వహించగలరు. ఈ చిత్రానికి జి. ఆదిశేషగిరిరావు నిర్మాత. సజ్జనుడు కృష్ణకు సర్వజనుల ఆశీస్సులు లభించుగాక!



'దొరలు—దొంగలు'లో

## జూన్‌లో ప్రారంభం!

"అల్లుడొచ్చాడు" చిత్రం పూర్తయిన నిజాన్ని పాఠకులకు తెలిపి ఒక వారం దాటింది.

ఈ వారం ఏదేని కొత్త వార్తను పాఠకులకు తెలియ చెయ్యాలి. న్యూస్ ఏమైనా వుందా? అని నిర్మాత ఎ. వి. సుబ్బారావుగారిని అడిగాను.

జూన్ నుంచి "నటసామ్రాట్‌తో వర్ణ చిత్రం ప్రారంభమవుతుంది" అన్నారు. ప్రతినెలా పక్షం రోజులు ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌కు అక్కినేని కేటాయించారు అని చెప్పారు, సుబ్బారావుగారు.

అక్కినేని నటించబోయే వర్ణ చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచన్ను, చలపతిరావు సంగీతాన్ని, సెల్వరాజ్ ఛాయను, జి. వి. సుబ్బారావు కళను, కృష్ణస్వామి కూర్పును నిర్వహిస్తారు.

దర్శకత్వంతోబాటు చిత్రానువాదాన్ని తాతినేని రామారావు చేపట్టారు. నవయుగ విడుదల. స్టుడియో అన్నపూర్ణ.

'పుణ్యంకొద్దీ పురుషుడు'లో అల్లు, విజయభాను





వాణిశ్రీ, రామకృష్ణ

## జగపతికి ఎప్పట్నుంచి?

ఈమధ్య హీరో నాగేశ్వరరావును శ్రీ శివలెంక నాగేశ్వరరావు వివాహంనాడు అబాట్స్ బరీలో కలిసినప్పుడు, జగపతికి ఎప్పట్నుంచి కాల్‌షీట్లు యిచ్చారు అని ప్రశ్నించాను.

జూన్‌నుంచి వరుసగా మూడు మాసాలు (45 రోజులు) యిచ్చినట్టు చెప్పి, "బంగారు బొమ్మలు" చిత్ర వైశిష్ట్యాన్ని వివరించారు.

తనకు నూరు శాతం నచ్చిన పాత్ర "బంగారు బొమ్మలు" చిత్రంలో వున్న వాస్తవాన్ని ఒప్పుకున్నారు.

"బంగారు బొమ్మలు" చిత్రానికి ఆచార్య ఆత్రేయ, మహదేవన్, వెంకటరత్నం, సంజీవి సాంకేతిక శాఖలకు అధిపత్యం వహిస్తారు.

కథ, చిత్రానువాదం మరియు దర్శకత్వం రాజేంద్రప్రసాద్‌గారు నిర్వహిస్తారు. షూటింగ్ అన్నపూర్ణ స్టుడియోలో. విడుదల అన్నపూర్ణ.

## 19 చిత్రాల నాయకుడు

పరుజన్మ ధరించిన మహానటుడు అక్కినేనిగారిని యిటీవల ఒక నిర్మాత కలిసి, తనకు చిత్రం చేసిపెట్టమని అడిగారు.

"నిరభ్యంతరంగా చేస్తాను. కానీ 19 చిత్ర పూర్తయ్యేంతవరకు ఓపిక పట్టండి" అని నిజా వెల్లడించారు.

మూడు దశాబ్దాల తరువాత, ఒకటిన్నర సంవత్సరం సినిమాకు స్వస్తిచెప్పిన కథానాయకుడు యిప్పటికీ అద్వితీయుడుగా పరిశ్రమలో పరిగణించబడుతున్నారంటే, ప్రజలు అక్కినేనిని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నారోమరి.

ఇంత పాపులారిటీని వరంగాగొన్న నాగేశ్వరరావును "సూపర్‌స్టార్" అని వ్రాయడం న్యాయం అనిపిస్తుంది.

మరో దశాబ్దం అక్కినేని రాజ్యమేలడం తథ్యము.

'ముగ్గురు మూర్ఖులు'లో
ముగ్గురు హాస్య సుందరులు

## చాణక్య పాత్ర భలే యిష్టం

అమాత్య శేఖరుడు చాణక్య పాత్ర పట్ల అక్కినేనికి మోజువున్న నిజాన్ని ఆయనే ఒప్పుకున్నారు. బ్రదర్ రామారావుగారు చాణక్య పాత్రను తనకు యిస్తే, దానికి పూర్తి న్యాయంచేసే శక్తి సామర్థ్యం నాగేశ్వరరావుకు వుంది.

"నటరత్న" దర్శకత్వం సుపర్బ్‌గా వుంటుంది అని అక్కినేని అనేకసార్లు చెప్పారు కూడా.

నందమూరిగారివద్ద "చాణక్య శపథం" అత్యద్భుత రూపాన్ని సంతరించుకునియుంది. బ్రదర్ నాగేశ్వరరావుగారు చాణక్య పాత్ర పోషించడాన్ని, రామారావుగారు మనస్ఫూర్తిగా అంగీకరిస్తారు.

కారణజన్ములయిన నందమూరి... అక్కినేనిగార్లు "చాణక్య శపథం"లో కలిస్తే, ఆచిత్రం "నభూతో నభవిష్యతి"గా చరిత్రను చేసుకుంటుంది.

## హ్యాండ్‌సమ్ హీరో

సురేష్ అధినేత భారీ తారాగణంతో ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "సెక్రటరీ" చిత్రంలో కొంత భాగాన్ని నేను చూశాను.

అత్యుక్తి కాదు కాదుగాని... రాజశేఖరం పాత్రలో అక్కినేని బలే హ్యాండ్‌సమ్‌గా కనిపించి, భళేభళేగా నటించారు. అగ్రనటిని, జయసుధను, కాంచనను, సూర్యకాంతాన్ని వుడికిస్తూ, కవ్విస్తూ, అక్కినేని ఒక పాటలో వేశారే స్టెప్పు... అని ప్రేక్షకులను ఆనంద పారవశ్యంలో ముంచెత్తగలవు.

## పోటాపోటి నటన

రిచ్‌మాన్ రాజశేఖరంగా అక్కినేని; జయంతిగా వాణిశ్రీ పోటాపోటీగా నటిస్తున్న నిజాన్ని, ప్రేక్షకులకు తెలపవలసిన బాధ్యత నాదనుకొంటాను.

మహదేవన్ మహాత్మ్యం, విన్సెంట్ ఛాయా గ్రహణ వైభవం, ఆత్రేయ రచనా ప్రాభవం, రామానాయుడిగారి రాజసపు భారీతనం "సెక్రటరీ"ని మహోన్నతంగా తీర్చిదిద్దుతున్నట్టే, కె. ...



'వింత ఇల్లు—సంత గోల'లో ప్రభ, శరత్

## రామకృష్ణకు శోభన్ అంగీకారం

"వైకుంఠపాళి" చిత్ర నిర్మాత, రామకృష్ణ ఆర్ట్స్ అధినేత రామకృష్ణారెడ్డి, తనకు అత్యంత ప్రీతిపాత్రుడయిన భమిడిపాటిని తీసుకుని, హీమాన్ యింటికివెళ్లి యిరవై రోజులయిన తరువాతిరోజున, నేను కనిపించాను.

అభినందనలు స్వీకరిస్తారా అని; రామకృష్ణారెడ్డికి షేక్‌హాండ్ యిచ్చాను. దేనికి అన్నారు, ఏమీ తెలియనట్టు.

"నాకు అన్నీ తెలుసు. భమిడిపాటిగారు చెప్పిన కథ శోభన్‌కు మనస్ఫూర్తిగా నచ్చినట్టు కూడా తెలుసు." అని తెలిసిన నిజాన్ని చెప్పాను.

వసూళ విజేత బాపయ్య దర్శకత్వాన్ని, మహ



"‌. ఇది మీ పాత్ర" — దర్శకుడు.

"అలాగే..." — నటి.

"మీరు అచ్చం పిచ్చిదానిలా నటిస్తారనే మీకీ పాత్ర ఇచ్చాం" — నిర్మాత.

"నీకా సందేహం ... — "

ఫ్లాట్‌ఫారం మీద ఓ శవం ఉంది. దాని ప్రక్కన పదేళ్ళ కుర్రాడు ఏడుస్తున్నాడు. ఆ శవం చుట్టు చిల్లర డబ్బులు పడున్నాయి.

'ఎవడో దిక్కులేనివాడు చచ్చాడు. దహనం చేయటానికి డబ్బులు వేశారు.' చిల్లరకోసం హోండ్ ... చిల గ శేదు అయిదు

గ్రుచ్చుకున్నాయి... ఆ కుర్రాడి వైపు చూచింది... వంటిపై చొక్కా లేదు; చినిగిన నిక్కరు; మాసిన తల, జిడ్డువారిన ముఖం... అంతుకు మించి ఉన్న ఒక్క నీడను పోగొట్టుకున్నాననే బాధ.. అంతులేని దుఃఖం. తన చుట్టు ఉన్న ప్రపంచాన్ని చూడలేని స్థితిలో ఉన్నాడు.. తండ్రి ముఖం చూస్తూ విల పిస్తున్నాడు నవతకు దుఃఖం పొంగిపొరిలింది... నిలువలేక పోయింది గబగబ వచ్చి కార్లో కూర్చుంది. కారు కదిలింది.

* * *

కారు దిగి ఇంట్లోకి వెళ్లింది నవత.

"మమ్మీ . మమ్మీ .." అంటూ సురేష్, రేఖ దగ్గరికి వచ్చారు.

వాళ్ళను చూచింది. నవ్వుతూ, చేతిలో బిస్కెట్లతో ఉన్నారు, రంగు, రంగుల బట్టలతో మెరిసిపోతున్నారు. మమ్మీని చేరుకున్నామనే ఆనం దంతో పొంగిపోతున్నారు. . ఫ్లాట్‌ఫారం మీద కుర్రాడు గుర్తుకొచ్చాడు. మళ్లీ దుఃఖం పొంగి పొరిలింది . గబగబ పైకి వెళ్లింది

"మమ్మీ... మమ్మీ ." అంటూ కేకలేశారు సురేష్, రేఖ

"రండి, మనం బయట ఆడుకుందాం" అంటూ వాళ్ళను బయటకు పిలుచుకెళ్లింది ఆయ.

నవత మంచంమీద పడి భోరున ఏడ్చింది ఆమె హృదయావేదనకు ప్రకృతి కూడ ఏడ్చింది.. మెరుపులు మెరిసాయి, ఉరుములు ఉరిమాయి, వర్షపుధారలు భూమ్యాకాశాలను ఏకం చేశాయి

ఏడ్చి, ఏడ్చి నవత కళ్ళు ఎర్రబడ్డాయి ఎంత ఏడిస్తేనేం ? పోయిన మనిషి రాలేదు. ఇది చిత్రం కాదు మొదటి రీళ్ళలో చనిపోయిన వ్యక్తి చివరి రీళ్ళలో బ్రతకటానికి ఇది జీవితం. సత్యం... ఒకసారి మరలిపోయిన వ్యక్తి మళ్లీ రాడు.

హృదయం దుఃఖంతో నిండిపోయింది అమిత మైన బాధ . తాను భరించలేదు. . ఇది శాప ... నిజమే! . లోకమంటే ఏమిటో భగవంతుని రూపం కనిపించే బాబుదే !!

... నొక నటి, లోకం దృష్టిలో — మంచికి ... పేరు. కాని, తానొక పాపాత్మురాలు, నిజ ... లో... తనకు దయ, జాలి, కరుణ ఇవేమి ... చూపుతున్నదంతా వట్టి నటనే... అభి ... లు నిజమని నమ్మారు... కాని, వారు నా నిజ ... ం తెలిసిన తరువాత ఇంతకన్నా హీనంగా ... స్తారు ఏ నోటి నుండి పొగిడారో, అందలం ... క్కించారో. ఆ నోటినుండే ద్వేషిస్తారు, గడ్డిపోచ కన్నా హీనంగా చూస్తారు. వారి మాటలు తాను వినగలదా ?. భరించగలదా ? సత్యం ఎవరికి తెలుసు ?. . తన గత జీవితం ఎందరికి తెలుసు? .. సినిమా రీళ్ళలా ఆమె జీవితం ఆరేళ్ళు వెనక్కు వెళ్లింది

* * *

"నళినీ! నీవు నటివి అవుతావంటే నాకు అభ్యంతరం లేదు. కాని, నటిగా ఎంత పేరు తెచ్చు కుంటావో, ఆ వాతావరణమే నిన్ను అంతటి ... నానికి దారి చూపుతుంది అప్పుడు మన ఇద్దరి ... అడ్డుగోడలు నిలుస్తాయి" — గోపాల్.



## అందాలు చిమ్ముతూ ఆకర్షణ వెద చల్లితే



## మీదారి పొడవునా చూపుల తోరణాలే !

లాక్మే వానిషింగ్ క్రీం మీ సౌందర్యానికి రాచబాట. మంచులో తడిసి, తొలికాంతిలో విరిసిన పూవులా మిమ్మ చేస్తుంది.

శ్రేష్ఠమైన మేకప్‌కు ఆదర్శవంతమైన ఆధారము లాక్మే వానిషింగ్ క్రీం. దీనిపై పౌడరు చాలాసేపు హత్తుకొనివుంటుంది

ఎంతో తేట అయింది, ఎంతో సహజమైంది; అయినా ఎంత మార్పును తెస్తుంది.

**లాక్మే వానిషింగ్ క్రీం**

అద్దుకొన్న పౌడరును హత్తుకొని వుంచుతుంది.




మీ సౌందర్య పోషణ మా ఏకైక ఆశయం

లాక్మే

dCP LVC 2 o Te

"అంత మాట అనకండి. నేను సినిమా నటిగా కావాలని ఆశించింది. మీ కోసం, మన బాబుకోసం. ఉద్యోగం కోసం ప్రయత్నం చేయడమే కాని, దొరకటం సులభం కాదు... కడుపునిండా తినటానికి తిండిలేదు. మన మెలాగో సర్దుకోగలము. కాని, బాబు ముఖం చూడండి, వేళకు అన్నం లేక ఎలా ఉన్నాడో!... చదువు ఎలాగో లేదు. ఉన్న ఈ పాటి అందాన్ని సద్వినియోగం చేసుకుంటాను. నా మీద నమ్మకం లేకపోతే చెప్పండి మానేస్తాను" — నళిని.

"నీ మీద నమ్మకం లేకకాదు నళిని. ఆ వాతావరణమే నీలో మార్పును తెస్తాయి. అవే పతనానికి దారి తీస్తాయి."

"అలా ఎన్నడు అనుకోకండి. అన్నిటిల్లాగే, ఈ రంగంలో మంచి, చెడూ రెండూ ఉంటాయి. మంచిని గ్రహించి, చెడును వదలివేయటం నేర్చుకుంటే సరి!"

"సరే... నీ ఇష్టం"

"మీరు అంగీకరిస్తారని నాకు తెలుసండి. రేపు రాజాగారు స్టుడియోకు రమ్మన్నారు. స్క్రీన్ టెస్ట్ చేస్తారట, ఇద్దరం వెళ్దామండి."

* * *

కాలగతిలో రెండేళ్ళు గడిచాయి... నళిని, నవతగా పేరు మార్చుకుంది... నటించిన చిత్రాలన్నీ విజయవంతం అయ్యాయి... ఎంతోమంది ప్రేక్షకులకు అభిమాన నటి అయింది...

ఒక రోజు —

"ఎక్కడికి నళిని అంత ముస్తాబు చేసుకున్నావ్ ?" — గోపాల్.

"సుకుమారుగారు పార్టీకి పిలిచారు ... వెళ్తున్నా" —

"ఎవరు ?... నీతో చాల చిత్రాలలో నటించారే, అతనా ?..."

"అవునండి. నేనంటే అతనికి ఎంతో అభి

## న వ త

మానం. నన్ను మరీ, మరీ రమ్మన్నారు."

...కారు శబ్దం విని నిట్టూర్చాడు గోపాల్.

* * *

మరో రోజు.

రాత్రి పన్నెండు అయింది. పోర్టికోలో కారు ఆగింది. శబ్దానికి మగత నిద్రలో ఉన్న గోపాల్ మేల్కొన్నాడు. క్రిందికి దిగాడు. పనిమనిషి తలుపు తెరిచింది. నవత తూలుతూ వచ్చింది. గోపాల్ తదేకంగా చూశాడు... మాసిన బట్టలు, రేగిన జుట్టు — ఆమె స్థితి తెలుసుకున్నాడు.

"మీరింకా పడుకోలేదా ?..." తడబడింది.

"ఆఁ... కారు శబ్దం విని వచ్చాను. ఎక్కడికెళ్ళావ్ నళిని ?"

"సుకుమారు ఇంటికి. పార్టీ ఇచ్చారు..." అంటూ మేడ మెట్లెక్కింది.

నవత వెళ్ళినవైపు చూస్తూ నిలబడిపోయాడు గోపాల్.

* * *

"మీతో ఓ విషయం మాట్లాడాలండి"— నవత.

"నాకు తెలుసు" — గోపాల్.

"ఏమిటి ?"

"నీ సెక్రటరీ చెప్పాడు."

"మరి, మీ అభిప్రాయం ?"

"నా అభిప్రాయం ఎలా ఉన్నా జరిగేది జరగక మానదు... చూడు నళిని, నీవు సినిమాలో చేరక ముందు ఒక విషయం చెప్పాను గుర్తుందా ?... పతనం అవుతావని. కాని, నీవు నెగ్గుతానన్నావ్... ఓడిపోయావు. ఆశించిన వారందరికీ ఆనందాన్ని అందించావ్. నేడు ఆ సుకుమారును వివాహం జేసుకుంటానన్నావ్... నేను అభ్యంతరం ఎలా చెప్పగలను ? తెడ్డు తెగిన నావ ఏ దరి చేరినా ఒకటే... కాని, మునిగిపోకుండా కాపాడుకోవాలి. నీవు బాబు కోసం, నా కోసం ఇస్తానన్నా మేడ, కారు, డబ్బు నా కనవసరం. నేను జీవించి ఉండగా బాబు అనాథ కాలేదు, కాడు... నా రెక్కలు ముక్కలైనా సరే పెంచి పెద్దవాణ్ని చేస్తాను. నీ కొడుకుగా కాదు. నా బిడ్డగా! నేటినుండి వాడికి తల్లి లేదు. నేనే తల్లి దండ్రి సర్వస్వం... వస్తాను..." బాబుతో వెళ్ళిపోయాడు గోపాల్.

చేతిలో విడాకుల కాగితం చూస్తూ ఉండిపోయింది నవత.

* * *

జరిగిన కథ మదిలో మెదిలేసరికి కళ్ళలో కన్నీరు నిండాయి. పట్టుదలతో ఆనాడు వెళ్ళిపోయారు. నేడు... అనాథలా దిక్కులేని చావు చచ్చారు... దీనికంతకు కారణం తాను. తాను సర్వభోగాలు అనుభవిస్తూ, కన్నబిడ్డను ముష్టివాణ్ణిగ వీధుల్లోకి తరిమింది. తాను తిని మిగిలింది వీధుల్లోకి విసిరింది. ఆ విసిరిన దానికోసం ప్రాకులాడే పిల్లల్లో తన కొడుకూ ఒకడు... ఏ కన్నతల్లికీ ఇంతకంటే క్షోభ ఉండదు.

తన కొడుకు దూరంగా ఎందుకుండాలి ?... ఇప్పుడైనా తన తల్లి ఎవరో తెలుసుకోవాలి... దుఃఖంతో అల్లాడిపోతున్నవానికి 'నేనే నీ తల్లి' నని వడిలో కూర్చోబెట్టుకోవాలి... వాడిలో కలిగే ఆనందాన్ని చూడాలి... తనకూ తల్లి ఉందని పొంగిపోతాడు... అవును తాను బాబును చూడాలి. లోకం దృష్టిలో తనకు ఇద్దరు బిడ్డలు. కాని, నేటినుండి ముగ్గురు'... గబగబ గదిలో నుండి బయటకు వచ్చింది. వీధి గుమ్మంలో సుకుమారు తూలుతూ వస్తున్నాడు. సహాయ నటి సహాయం చేస్తుంది. ఇద్దరూ గదిలోకి వెళ్ళారు.

నవత ఇదేమి గమనించలేదు... బాబును చూడాలి... అంతే... వర్షం కురుస్తుంది, మెరుపులు మెరుస్తున్నాయి, మేఘాలు గర్జిస్తున్నాయి... కారును రోడ్డుమీదికి పరుగెత్తించింది... రివ్వున వచ్చి ఓ లారి ఢీకుంది... జనం మూగారు.

* * *

హాస్పటల్ ముందు అనేక కార్లు నిల్చున్నాయ్. అనేకమంది గుంపులుగా ఉన్నారు. అందరి ముఖంలోను ఆందోళన... ఏదో తెలుసుకోవాలనే ఆతృత.

డాక్టర్ బయటికి వచ్చారు. అందరూ అతని వైపు చూశారు... అందరిలోను ఆతృత... ప్రఖ్యాత సినిమా నటి నవతకు ఎలా ఉందో?... అందరిలోను ఇదే ప్రశ్న...

"ఆమెకు మతి చలించింది" లోపలికి వెళ్ళిపోయారు డాక్టర్.

అందరూ వెనక్కు మళ్ళారు.

సగం పిక్చర్ తీసిన నిర్మాతలు నిర్జీవులయ్యారు.

అభిమానులు కంట తడి పెట్టారు.

"తరువాతి చిత్రంలో పిచ్చి పాత్ర. కాని, నిజంగా పిచ్చిదైపోయింది"—వాపోయాడు డైరెక్టర్.

సుకుమారు సినిమాలోని నటనను రిపీట్ చేశాడు.



# వెలను పరిశీలించండి. గుణమును పరీక్షించండి

# పాయింట్

అతి నాణ్యమైన బట్టల సబ్బుపొడి




వెల పట్టి

పన్నులు చోటునుంచి చోటుకి వ్యత్యాసం ఉండుగనుక ప్యాకమీద చూపబడిన వెలకు పన్నులను చేర్చలేదు. హైదరాబాద్‌లో అమ్ముడు వెలలను (పన్నులు చేర్చి) ఈ క్రింద ఇవ్వబడినవి—శ్రేష్ఠమైన సబ్బు పొడులతో పోల్చగల పాయింట్ అప్పటికీ తక్కువ ధర గలది.

| పాయింట్ | 750 గ్రాం | 550 గ్రాం | 200 gm |
|---|---|---|---|
| ప్యాక్ వెల (పన్నులు లేక) | 8.90 | 6.80 | 2.63 |
| మీరు ఆఖరుగా ఇయ్యవలసిన వెల (పన్నులు చేర్చి) | 9.33 | 7.13 | 2.76 |



గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ,
బెంగుళూరువారి ఒక శ్రేష్ఠమైన ఉత్పత్తి

## నాసికేతుని కథ

(18వ పేజీ తరువాయి)

వెళ్లేరు రేపు ఉదయం రావచ్చును'' అన్నాడు నాసికేతుడు.

"సరే నేను మళ్లీ వస్తాను" అని ఆ ఆశ్రమం నాలుగు మూలలా చూచింది. కొంచెం దగ్గరగా ఒక గుడిసె ఉంది. అది తనుండడానికి బాగుందనుకుంది. సాయంత్రం వెళ్లి ఇల్లంతా శుభ్రం చేసింది. తెల్లవారిన తరువాత వస్తాననిచెప్పి వెళ్లిపోయింది.

తెల్లవారుజామున ఆశ్రమంలో ఎవ్వరూ లేవకముందే లేచి, ఇంటికివచ్చి ఇంటిముందు కలాపిజల్లి, ముగ్గులు పెట్టింది. ముఖద్వారానికి తోరణం కట్టింది. ఇల్లు చక్కగా అలంకరించింది. తిరిగి తన గుడిసెలోనికి వెళ్లిపోయింది.

నాసికేతుడు లేచి, తన తల్లి ఇది చేయడం చూశాడు. ఆమె వెళ్లిపోవడం చూశాడు. అంతే. ఇంతట్లోనే ఉద్దాలకుడు వచ్చాడు. తన నివాసగృహం ఇదివరకెన్నడు లేనంత కలకల్లాడుతూ ఉండడం అతనికి అత్యంతాశ్చర్యకరంగా ఉంది. తన్ను తాను నమ్మలేక పోతున్నాడు. నాసికేతుణ్ణి పిలిచి ''ఎవరుచేశారు ఈ పనంతా'' అని అడిగాడు. ''నాకు తెలియదు — మా అమ్మ చేసి ఉంటుంది'' అన్నాడు.

### 5

ఆ మాట వినగానే, అతనికి మెదడులో ఏదో మెరసినట్లయింది. కాని అప్పటికే తన నిత్య యోగానుష్ఠానానికి — సమయం కావడంచేత నదికి వెళ్లిపోయాడు. సాయంత్రం తిరిగి వచ్చాడు. ''మీ అమ్మ ఎప్పుడొస్తుంది'' అని నాసికేతుణ్ణి అడిగాడు. ఆ సంగతి నాకు తెలియదు. అని జవాబు చెప్పాడు. ఆపైని ''మొట్టమొదట ఇక్కడికి ఏ సమయంలో వచ్చింది'' అని తిరిగి అడిగాడు. ''సాయంకాలము వచ్చింది. చీకటి పడకుండా వెళ్లింది'' అని జవాబిచ్చాడు.

తను వచ్చినరోజు సాయంత్రం ఆమె వస్తుందేమో అని కొంతసేపు చూచాడు. కాని రాలేదు. తెల్లవారగానే లేచి స్నానానికి నదికి వెళ్లేడు. చంద్రవతి వచ్చి, యింటి ముంగిలి కలాపిజల్లి ముగ్గులుపెట్టి, యిల్లు శుభ్రంచేసి అతడు హోమం చేయడానికి అన్నీ సిద్ధంచేసి వెళ్లిపోయింది.

ఉద్దాలకుడు వెంటనే తిరిగివచ్చాడు. ఆరోజు మధ్యాహ్నం తాను ఒక హోమం చేయవలసి వుంది. ఇంట్లో అడుగు పెట్టేసరికి హోమ వేదిక వద్ద కావలసిన వస్తువులన్నీ అమర్చబడి ఉన్నాయి. ''ఏమిటిది'' అని మనస్సులో ఆందోళన పడుతున్నాడు. నాసికేతుణ్ణి అడిగాడు. కాని నాకు తెలియదన్నాడు.

అంతకు ముందెప్పుడూ ఆమె ఆ ఆశ్రమానికి, యజమానుడైన ఉద్దాలకుని చూడనేలేదు. ఆ దినం అతడు నది నుండి స్నానంచేసి వస్తుండగా, చూడడం తటస్థించింది. జడలతో ఉన్నప్పటికి అతని ముఖం మంచి వర్చస్సుతో మనోహరంగా ఉంది. కళ్లలో కాంతి ఉబుకుతున్నది. విశాల వక్షస్థలం. కండలు తిరిగిన బాహువులతో ఆతని శరీరం బంగారు ఛాయతో ప్రకాశిస్తోంది.

అతణ్ణి చూడగానే హృదయంలో స్పందనం కలిగింది. శరీరంలో చైతన్యం లొణికిసలాడింది. మనస్సులో ఏదో మధురానుభూతి మాటు చేసుకొన్నది. *

### 6

హోమాదికం ముగించుకొని కొంచెము సేపు విశ్రమించి, సాయంకాలం కాకముందే నాసికేతుణ్ణి దగ్గరకు తీసుకొని, ఉద్దాలకుడు ఆప్యాయతతో అతని చేష్టలకు మురిసిపోతూ ఆనందిస్తున్నాడు. కుమారుని కౌగలించుకుంటున్నాడు; ముద్దు పెట్టుకుంటున్నాడు.

అదే సమయంలో చంద్రవతి మెఱపు తీగలాగ ఆశ్రమంలో ఉద్దాలకుని ఎదుట నిల్చున్నది. తటాలున పిల్లవాడిని వదలి, ఆమె ముఖంలోకి చూశాడు. ఆ నుదురు, ఆ కనుబొమ్మలు, ఆ చెంపలు, ఆ పెదిమెలు, ఆ ముఖము అంతా తనకు ఆ రాత్రి కలలో కనిపించి ముద్దు పెట్టుకొన్నవే తన్ను గాఢంగా కౌగలించింది. ఆమె శరీరమే ఒక్కమారు ఛాయా చిత్రంగా ఉండిపోయాడు. వెంటనే నిదానించాడు. తన మనోదృష్టిని కేంద్రీకరించాడు.

తనను; కౌగలించడం — వీర్యస్ఖలనం తామరపువ్వులో దానిని సంగ్రహించడం చంద్రవతి దానిని వాసన చూడడం, గర్భం దాల్చడం చలన చిత్రంలో రీళ్లవలె, అతని

## నాసికేతుని కథ

ముందు మెదలసాగాయి.

ఉద్దాలకుడు, ఆమె కళ్లల్లోకి చూశాడు.



ఆమె అట్లనే అతనిని చూచింది. నాలుగు కళ్ళు రెండు కళ్లయినాయి. ఆమె సిగ్గుతో తలవంచుకొంది.

తన తండ్రి తనను అడవుల పాలు చేయడం తృణబిందుడు తనని, బిడ్డని సంరక్షించడం మొదలైన సంగతులేవో చెప్పబోయింది. కాని ఉక్కిరిబిక్కిరియైన సంతోషం చేత నోరు మెదపలేకపోయింది.

ఉద్దాలకుడు గ్రహించాడు "నేను దివ్య దృష్టితో నీ సంగతి అంతా గ్రహించాను. ఇది నేను నా తండ్రియైన బ్రహ్మ మాట వినక పెళ్లి చేసుకోకుండా తపస్సు చేసినందు వల్ల నీకీ అపవాదం కలిగింది. నా తండ్రే "నీకు పుట్టిన కుమారుడు, నీ భార్యను నీకు తెలుపుతాడు" అని చెప్పి వెళ్ళిపోయాడు. అతని మాటకు తిరుగుందా? ఆయన మాట అక్షరాలా నిజం.

"నీవు నా భార్యవు — నాసికేతుడు నా పుత్రుడు." ఇదిగో, ఇప్పుడే మనం ముగ్గురం — నీ జనకుడైన రఘుమహారాజు వద్దకు వెళదాం. అని వారు ముప్వురూ ఆయన నగరం ప్రవేశించి, రాజు గారికి ఉద్దాలక మునీశ్వరుడు వచ్చాడని తెలియపఱచాడు.

మునీశ్వరుడనగానే, రాజు తను స్వయంగా ఆయన నెదుర్కొని, ఆహ్వానించి, ఆస్థానంలో ఉన్నతాసనం ఇవ్వడం ఆచారం. ఆ రీతిగానే రఘుమహారాజు ఎదురుగా వచ్చాడు. చూడగానే ఉద్దాలకుడేగాక, తన కుమార్తె చంద్రవతి ఉన్నది. వారికొక అబ్బాయికూడా ఉన్నాడు. అతడు పొందిన ఆశ్చర్యానికి, సంభ్రమానికి అంతులేదు. చంద్రవతి తల్లికి వెంటనే కబురుచేశాడు. ఆమె వచ్చి కూతురుని కౌగలించుకొంది, కన్నుల వెంట అశ్రువులు వస్తున్నాయి.

ఉద్దాలకుడు వారి నందఱిని వారించి కూర్చోమన్నాడు. "చంద్రవతీకన్య ఋతుస్నానార్థమై వచ్చినదగ్గర నుండి, ఆమె తండ్రి అడవికి పంపివేయడం, నాసికేతుడు పుట్టడం, తిరిగి వారి సమాగమం అంతా పూసగుచ్చినట్లు" చెప్పాడు. అందఱూ స్తబ్ధులైనారు.

"ఆమె నాసికద్వారా నావలన గర్భవతి యైనది. కాబట్టి నా భార్య— అయితే వివాహానికి ముందే ఇది జరిగినది. కాబట్టి ఇప్పుడు యథావిధిగా, వేదోక్తంగా ఆమెను

# డాక్టర్లు చెబుతున్నారు, 3 నెలలు దాటినప్పటినుంచి పాలు మాత్రమే చాలవు ఆరోగ్యకరమైన రక్తానికి తగినంత ఐరన్ కలిగిన ఘన ఆహారం మీ బిడ్డకు అవసరం.




మీ పెరిగే బిడ్డకు ఫారెక్స్
ఏమి సమకూర్చుతుందో చూడండి :

- ఆరోగ్యకరమైన రక్తము మరియు సత్తువకు తగినంత ఐరన్.
- బలమైన పళ్ళు మరియు ఎముకలకు కాల్షియమ్ మరియు విటమిన్ డి.
- త్వరితమైన పెరుగుదలకు తోడ్పడే తేలికగా జీర్ణము కాగలిగిన ప్రొటీన్.
- అతని వయస్సు మరియు మారుతూ ఉండే అవసరాలకు అనుగుణ్యంగా తగినంత శక్తి.

మీ బిడ్డ పెరుగుదలకు అనుగుణ్యంగా ఫారెక్స్ అవసరం

| మీ బిడ్డ వయస్సు | ఫారెక్స్ ఎంత కావాలి |
|---|---|
| 3—6 మాసాలు | 1—2 టీ చెంచాలు రోజుకు రెండు సార్లు |
| 6—9 మాసాలు | 3—4 టీ చెంచాలు రోజుకు మూడు సార్లు |
| 9 మాసాలు— 3 సంవత్సరాలు | 4—6 టీ చెంచాలు రోజుకు నాలుగు సార్లు |






# ఫారెక్స్

3 నెలలు దాటినప్పటినుంచి సంపూర్ణమైన పెరుగుదలకు మీ బిడ్డయొక్క మొట్టమొదటి ఘన ఆహారం.




CMGF 47-236-TL

నాకిచ్చి పెండ్లి చేయండి'' అని ప్రకటించాడు.

రఘుమహారాజు అలాగే వైభవంగా వారికి పెండ్లి చేశాడు.

సంతానోత్పత్తికి ముందు వివాహం జరుగుతుంది. ఇది సంతానోత్పత్తి అయాక

## నాసికేతుని కథ

వివాహం.

ఆధునిక వైజ్ఞానిక శాస్త్రవేత్తలు గుర్తింతురు గాక.

ఈ నాసికేతుని కథనే నాసికేతోపాఖ్యానము అనుపేర ప్రశస్త పద్య కావ్యంగా, మహాకవి శ్రీనాధుని బావమఱది దగ్గుపల్లి దుగ్గన—సంతరించాడు. ఇందుదాహరింపబడిన పద్యం ఆ కృతిలోనిదే. 

## పత్రికా డైరీ

### పార్సిళ్ళలో పాములు!

యూనియన్ పబ్లికు సర్వీసు కమీషను ఆఫీసుకు వచ్చిన పార్సెళ్ళలో ఓ పార్సిలులో చలనం కనుపించిందట. ఏమీ మాయ అని చూస్తే లోప 18 అంగుళాల పొడవున్న తాచుపాము వుందట అందులో ఏటుల!! అదట్లుండగా మరో ముచ్చట మీరట్ యూనివర్సిటీ వైస్‌చాన్సలరుకు ఎవరో లోకల్‌లో పోస్టులో ప్రేమత ఓ పార్సిలు పంపారట సంతకం చేసి, ఆ పార్సిలు తీసుకుని ఆయన విప్పడానికి సంబరపడుతుండగా పార్సిలుకు ఏవో ప్రాణం వచ్చినట్టు కదలిందట. తను రాముడంతటి వాడు కాబోలని ఆనందించక, ఆయనా పార్సిలును క్రింద పడేసి, అవి విప్పదీసే బాధ్యత కేవలం పోలీసులకు ఒప్పజెప్పారట. వారాపని చేసి చూస్తే లోపల తాచుపామొకటి పోలీసుల్ని చూసి నాలిక్కొరుచుకుందట. ఈ రెండు పార్సిళ్ళు మీరట్ నుంచే ఒకే వ్యక్తి చేతుల్లోంచి వెళ్ళాయట. పోస్టుకు. గనుక యీ సంఘటనల్లో విదేశీ ఏజంట్ల సంబంధ బాంధవ్యాలు కలవని కేంద్రయాత్రా సౌకర్యాలమంత్రి శంకరదయాల్‌శర్మ గారన్నారట. కాబ్బోరే ట్రిపుల్ యక్స్ ఆరేవై!

### కడుపు నొప్పిని మించిన ఆత్మహత్యా తాపం

తేనేపోడై అనే గ్రామానికి చెందిన బండారప్ప అనే యువకుడు కడుపునొప్పి భరించలేక, అది తగ్గే సూచనలులేక, జీవితంమీద విరక్తి కలిగి ఒంటి మీద కిరసనాయిలుపోసుకుని నిప్పంటించుకుని, ఆబాధకు తాళలేక, అంతకన్నా కడుపునొప్పి మంచిదనుకున్నట్టు రక్షించండి, కాపాడండి అని గావుకేకలు వేశాడట. దాంతో ఆ కేకలు వినిపించిన వాళ్ళొచ్చి అంత పనీచేసి, ఆసుపత్రిలో చేర్చారటతన్ని. ఇప్పుడు బండారప్ప ఒళ్ళంతా కాలి చావు బ్రతుకుల మధ్య ఊగిసలాడుతున్నాడట.

### అసభ్యత ఖరీదు 30 రూపాయలా?!

మద్రాసులో ఓ స్త్రీల స్కూలుముందు జోసఫ్ అనే కుర్రాడు వాడికగా నిలబడి, స్కూలుకు వెళ్ళే ఆడపిల్లలను, ఉపాధ్యాయినులను అసభ్యకరమైన లైంగిక సంబంధమైన మాటలు అంటున్నాడట. ఓపికపట్టినన్నాళ్ళు పట్టి ఇహ విషయం ఆ ఆడపిల్లలు పోలీసులకు తెలియజేశారట. వాళ్ళొచ్చి ఆవుత్సాహవంతుణ్ణి డ్యూటీ చేస్తుండగా పట్టికోర్టు ముందు పెడితే సదరు కోర్టు ముప్పయి రూపాయలు అపరాధం విధించిందట. ఓస్సింతేనా!

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

కె టి వై. — ఇల్లందు

రామాయణ మహాభారతాలు ఒట్టి కట్టు కథలేనంటారా?

మహాప్రభూ! నాకు తెలియదండీ.

స్త్రీకి సమాన హక్కులుండడం సమంజసమే. కొన్ని విషయాలలో అతి స్వేచ్ఛ హద్దులు మీరుతుందేమో?

మీ మగనారు మీరినప్పుడేమైంది ఈ అనుమానం?

కె. ఎస్. ఎమ్ — సిద్ధాంతం

ఎన్ని కార్డులు రాసినా సమాధానం ఇవ్వరు మీరూ మీకు తెలిసిన వాళ్లకు, చుట్టాలకు మాత్రమే సమాధానాలిస్తారా?

చచ్చాను! ఇంతమంది చుట్టాలుంటే ఎప్పుడో కాశీ పారిపోవాలి! ఇక, తెలిసినవాళ్లందరికీ అంటే స్థలం ఏది?! .. అయినా మీరిలా ఆలోచించడం బాగులేదు!

పి ఎమ్. డి. — వీరవాసం

సమాజం స్త్రీని అగౌరవపరుస్తోంది. అది ఎప్పుడూ మారుతుంది అనేనారు స్త్రీని గౌరవిస్తున్నారంటారా?

తనపై తనకే గౌరవం లేని జాతిని ఎవరూ గౌరవంగా చూడరు సోదరీ, అవమానానికి తల వగ్గితే అంతే ఇంక. రోగానికి రోస్టు అన్నారు ఈ రోగం కుదరాలంటే లక్షణాలు పైకి ఏడవాలి, గోల చేయాలి. తక్షణం కాకపోయినా కొంతకాలానికైనా రోగానికి మందు దొరుకుతుంది.

పి. కె. — మొగలపల్లి

సినిమాలు చూడటం వలన ప్రయోజనం ఉందా?

ఎవరికి? మీకా? తీసిన వారికా? చూడడం వల్ల మీకేం ప్రయోజనం కల్గిందో మీరే చెప్పకలరు. మీరు చూసినందువల్ల మటుకు తీసినవారికి రాబడి పెరుగుతుంది.

మనిషి చేతిలో చావుందా? బ్రహ్మరాతలో ఉందా?

బ్రహ్మరాత చూడలేదు. కాని చావాలని చచ్చినవాళ్లని చూశాను. చావుకి ప్రయత్నించి జెయిలుపాలైనవాళ్లని చూశాను!

జి ఎమ్. కె. ఆర్. — హైద్రాబాదు

పత్రికల్లో మీ పలుకుబడికి కారణం అందమా? కాకా పట్టడమా? లేక ప్రతిభ అనుకుంటున్నారా?

అదేదో మీరే నిర్ణయించి చెప్పేస్తేపోలే! చూడండి, మంచి పేరులాగే మంచి 'పలుకుబడి, కూడా ఎన్నెన్నో చేతలవల్ల కాని సమకూడదు ఏ ఒక్క చేతవల్లనో పోనూ వచ్చు! ఈమాత్రం ఇంగితం కూడా లేదంటారా నాకు?!

ఒ. ఆర్ డి. — కొండకమర్ల

ఈ రోజుల్లో స్త్రీలకు అహంకారం పెరిగిపోతూంది. కారణం మీలాంటి వాళ్లిచ్చే జనాబుల ప్రోత్సాహమే

మంత్రాలకు చింతకాయలు రాలుతాయా దాసుగారూ. మనస్సులో మాట కాస్త పైకి చెప్పడం తప్పు కాదన్న ధైర్యం తలెత్తితే అటువంటి స్త్రీ జాతిని చూసి ఆనందించాలి మీలాంటివాళ్లు

కె. సి. ఆర్ నల్లగొండ

కె. రా గారూ కదల వెంట బొమ్మలుకూడా పంపించాలా?

అక్కర్లేదు మహాప్రభో! ఆ [illegible]ద పత్రికల వాళ్లే పడతారు.

**"మా చిన్న పిల్ల చలాకీగా, ఆరోగ్యంగా, చురుగ్గా పెరగాలని నాకోరిక. అందుకే నేను రోజూ ఆమెకు బోర్న్‌విటా ఇస్తాను."**

OBM/3800 TL



**ుడు ఆమెకు తగ్గట్టుగా ఉండేందుకు నాకూ బోర్న్‌విటా అవసరం"**

"...మా మొత్తం కుటుంబం బోర్న్‌విటా త్రాగుతోంది. నా భర్త అదే కావాలని అంటారు ఎందువలనంటే, దానిలో మాల్టు, పాలు, గ్లూకోస్ మరియు పంచదార ఉండుటతో పాటు, బోర్న్‌విటా సమృద్ధమైన కోకో కలిగియున్నది. ఆయన అంటారు అత్యంత శక్తిభరితమైన ఆహారం దొరుకునది కోకో అని. బోర్న్‌విటా ఏ ఇతర ఆహార-పానీయముకన్నా అధికంగా కోకో కలిగియున్నది. బోర్న్‌విటాలోని కోకో దానిని మరింత రుచికరం చేస్తుంది. మా చిన్న పిల్లకు అదంటే ఎంతో ఇష్టం—నాకు తెలుసు అది ఆమె యొక్క కండరాలు, ఎముకలు మరియు మెదడు పెరుగుదలకు అవసరమై, అమూల్యమైన పోషకత్వమంతా ఆమెకు చేకూరుస్తోందని. ఇంతేకాక బోర్న్‌విటా ఏ ఇతర ఆహార పానీయములకన్నా ఎంతో పొదుపైనది కూడా. నేను కప్పుకు 2 చెంచాలు వేస్తాను (మిగతా ఆహారపానీయాలలోలాగా) కాని నా బోర్న్‌విటా డబ్బా చాలా ఎక్కువ రోజులు వస్తుంది. వాడి చూడండి. మీకే తెలుస్తుంది."




## క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా

**శక్తి ఉత్సాహం మరియు రుచికోసం ఆదర్శమైన ఆహార పానీయం.**

ప్రతి డబ్బాకు అధికమైన కప్పులు,
ప్రతి కప్పులో అధికమైన రుచి !

* * * పాప నివృత్తి * * * * * * ధర్మ పథం * * *

మానవ జీవితంలో పాపం, పుణ్యం అనే మాటలు ప్రతివిషయంలోనూ తరచుగా వినబడుతూ ఉంటాయి. మంచిపనులు చేస్తే పుణ్యం వస్తుందని, చెడ్డపనులు చేస్తే పాపం కలుగుతుందనీ అందరికీ తెలుసును. మానవుల మనస్సు చాలా బలహీనమైనది. సులభమైన వాటిలోనే అది శీఘ్రంగా ప్రవేశిస్తుంది. కష్టసాధ్యాంపై ప్రసరించడానికి మొగ్గడం చాలా అరుదు. పుణ్యకార్యాలు కష్టసాధ్యాలు కావడం వల్ల సరితూచి చూస్తే పాపకార్యాల వైపే ముల్లు చూపుతుంది.

పాపకార్యాలు చెయ్యకూడదనే సంకల్పమే ఉన్నప్పటికీ వాటిని చెయ్యకుండా ఉండడం కుదరదు. తెలిసి కొన్నిటినీ, తెలియకుండా కొన్నిటినీ పాపాలను చేస్తూ వుంటాము.
ఒక సమయానికి అత్యంత అవసరంగా ఒక వస్తువు కావలసి ఉంటుంది. దాన్ని సంపాదించడానికి డబ్బు కొంత అవసరం. ఆ సమయంలో తనదగ్గర డబ్బు ఉండదు. అందువల్ల తనపై ఎక్కువ నమ్మకం గల ఆప్తమిత్రుడిదగ్గరకు పోయి అడగవలసి వస్తుంది. నాలు గైదు రోజుల్లో తిరిగి ఇచ్చివేస్తానని మాటఇచ్చి బదులుతీసుకోవలసి వస్తుంది. దానివల్ల తన అవసరం తీరిపోతుంది. కాని తిరిగి బదులు తీర్చడంలో కొంత అలసభావం ఏర్పడుతుంది. అలాంటి భావం ఏర్పడకపోయినా అన్నమాట ప్రకారం అప్పు తీర్చలేకపోవడమున్నూ జరగవచ్చు. డబ్బు ఎగవెయ్యాలనే సంకల్పం తనకు ఉండనే ఉండదు. కాని అప్పుతీర్చడం ఒకటి, రెండు రోజులు ఆలస్యమయినా మాటతప్పినట్లేకదా! దానివల్ల తప్పకుండా పాపం సంభవిస్తుంది. ఇది తెలియకుండా సంభవించిన పాపం. ఇలాంటివే మరికొన్ని. మంచి తెలివితేటలు కలిగి కావలసిన పరీక్షల్లో కృతార్థుడయిన వ్యక్తి ఉద్యోగం దొరకక నానాఅవస్థలు పడుతూ ఉంటాడు. దైవవశాత్తూ ఒక కాళీస్థలం ఉన్నట్లు అతనిచెవిని పడుతుంది. దాని సంపాదనకు యోగ్యతలతో ఎక్కువ సంబంధం ఉండదు. అధికారికి కొంత ముడుపు చెల్లించాలి. అది ఎంతో రహస్యంగా జరగాలి. దానికి తగిన ఉపాయాలు ఆలోచించి డబ్బు చెల్లించి అతడు ఆ ఉద్యోగాన్ని సంపాదిస్తాడు. లంచం పుచ్చుకోవడం తప్పయినట్లు అది యివ్వడం కూడ దోషమే. ఆకార్యం వల్ల పాపం సంభవించక తప్పదు. ఆ ఉద్యోగికి ఇది తెలియక పోవచ్చు.

తెలిసే చేసే పాపములు ఎన్నో ఉంటాయి. వాటివల్ల పాపం వస్తుందని తెలిసే వ్యక్తి ఆకార్యాలకు దిగుతూవుంటాడు.

అయితే దీనికి కారణం ఏమిటి? తన సంకల్పం నెరవేర్చుకోవలెనన్న అభిలాషయే కారణంకదా! ఆకోరికను చంపుకుంటే దానివల్ల సంభవించే పాపాన్ని నివృత్తి చేసుకోవచ్చు. కోరికను చంపుకోవడం మానవమాత్రునికి సాధ్యం కానే కాదు. కాని, ముందువెనుకలు ఆలోచించి ఆకోరికను నెరవేర్చుకోవడంతో పాపానికి దూరంగా ఉండవచ్చును.

—బులుసు వేంకట రమణయ్య

## "వరకట్నమా? హొమ్మ!!"

ఆ మధ్య కధలురాసే ఓ స్నేహితురాలు దేశంలో ఎమర్జెన్సీ వొచ్చింది, ఎన్నో రకాల అవినీతి, అక్రమ కార్యకలాపాలను అరికట్టడానికి— ఆర్డినెన్సులు చేస్తున్నారు గవర్నమెంటువారు. కాని అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగానైనా వరకట్న నిషేధం చట్టంచేసి, కట్నాలు పుచ్చుకునే కుర్రవాళ్లను ఏ "మిసా" క్రిందో శ్రీకృష్ణ జన్మస్థానంలో పారేయకూడదా అంటూ వో వుత్తరం రాసింది— నిజమే—అలాంటిది చేయటానికి యిదే అనువైన సమయం— అన్నట్లు గవర్నమెంటువారు వరకట్న వ్యతిరేక ప్రచారం మొదలెట్టారు. పంజాబ్‌లో ఓ పెళ్ళి పందిరిమీద అధికారులు దాడిచేసి, కట్నం పుచ్చుకుంటున్న వరుణ్ణి, అతని తండ్రిని కూడా బేడీలువేసి పట్టుకుపోయారన్న వార్త పత్రికల్లో పడ్డది.. నిజంగా యిది శుభవార్తే కాని— సరే ఆ వరుణ్ణి తీసుకుపోయి జైల్లో పడేశారు అనుకుందాం...లేదా చెవులు మెలేసి కట్నం సొమ్ము కక్కించి వధువు తండ్రికి యిప్పించేరే అనుకుందాం— కాని ఆ తరువాత ఆ వధువు కాపురం సంగతేమిటని ? ఆ పిల్లదాన్ని ఆ కుర్రవాడు పుట్టింట వదిలేసిపోయాడే అనుకోండి ఏం చేయాలి ? ఆ పిల్లని ఏలుకోమని చెప్పటానికి చట్టం ఎంతమటుకు వినియోగపడుతుంది ?— చట్టం అంతగా అయితే విడాకులు యిస్తానంటుంది కాని — కాపురం చేయించగలదా ? అని సమస్య యిక్కడే మొదలవుతుంది...

ఇప్పుడు ప్రభుత్వోద్యోగులు కట్నం పుచ్చుకోవడం నేరం—వాళ్లమీద డిసప్లినరీ ఏక్షన్ తీసుకుంటాం అన్నారు గవర్నమెంటు వారు — ఇప్పుడు సమస్య ఏమిటీ అంటే గవర్నమెంటు వుద్యోగులకు యిద్దరు పెళ్లాలుండకూడదూ వుంటే వుద్యోగాలు పీకేస్తాం అన్న చట్టంమాదిరి యిదీ తాటాకుచప్పుళ్ల సామెత చందాన అయిపోయే ప్రమాదం వుంది. ఈ కట్నం పుచ్చుకున్న వాడిమీద కంప్లెయింట్ చేసేది ఎవరూ అని? వధువా? వధువు తండ్రియా? చేస్తే ఆపిల్ల పండంటి కాపురం గతేంగాను?

కట్నం ముందే "బ్లాక్"గా తీసుకుని మరీ పెళ్ళికి ఒప్పుకుంటే ? సరే పెళ్లైపోయాకా; పెళ్లికొడుకుని దబాయించుదాము అనుకుంటే — ఎలా సాధ్యం ? మొగుడు వదిలిన పెళ్లాన్నీ, పెళ్లాం వదిలేసినమొగుణ్ణీ, సమాజంలో ఒక్కలా చూసే సమదృష్టి మనకి రానంతకాలం — పిల్లని పుట్టింట దిగవిడిచేస్తాడేమో — విడాకు లంటాడేమో అల్లుడు అని, హడలిచచ్చే నిత్యచావు ఆడపిల్లల తలిదండ్రులకి మన శిష్ట సమాజంలో తప్పదు. కుర్రాళ్ల మనస్సులలోనే మార్పు రావాలి. కన్యాశుల్కం జాడ్యం క్రమేపీ అంతరించినట్లే యిదీ చైతన్యమార్గాన అంతరించేదాకా యీ చట్టాలు, నిబంధనలు బెదిరింపులు అన్నీ కేవలం వూరడింపుకే పనికొస్తాయి. అయితే ఏదో ఒక ప్రారంభం వుండాలి కనుక యీవరకట్న జాడ్య నిర్మూలనకు గట్టి పునాది రాయిగా యీ వరకట్న నిషేధ నిబంధనల్ని మనం హర్షించాలి — మనిషి మనసులో మార్పుకోసం—మనోమాలిన్య ప్రక్షాళన కార్యక్రమం కోసం కొన్నాళ్లు కొంతమందైనా అంకితమై పోవాలి ? అయితే ఆ అంకితమైపోయే వాళ్లెవరూ? అన్నదే ప్రశ్న... [వీరాజీ]

వాడితో ముడివేసుక్కూచుంటే, లేనిపోని అనుమానాలకి చోటు యిచ్చినట్లవుతుంది. వీళ్లిద్దరూ కుమ్మక్కయి యీపని చేశారని అనుకున్నా అనుకుంటాడా మోహన్‌రావు. అంతే! ఈ ప్రణాళికలో జయరాంకి చోటు లేదు. వసుంధరకి ఈప్లాను చెప్పి, ఆమెని వప్పించి, ఎలాగైనా పుస్తకం సంగ్రహించాలి ... లేకుంటే ఆ మిలటరీవాడు దారికిరాడు!

ఈ నిర్ణయానికి వచ్చాక వాసుకి వుత్సాహం యినుమడించింది. ఆ వుల్లాసంలో మరి రెండు వీధులు అనాయాసంగా తిరిగేశాడు. ఈ ప్లానులో లోపాలేవైనా వున్నాయాయని పరిశీలించాడు. అలాంటివేమీ లేవని తేలాక, ఆచరణ కార్యక్రమానికి పునాది వేసుకున్నాడు.

* * *

కెప్టెన్ మోహన్‌రావుగారి యిల్లు అశోక

## చరకసంహిత

(7 వ పేజీ తరువాయి)

నగర్‌లో వుంది. అధునాతనమైన కట్టడం. ముందు చిన్న కాంపౌండులో భవంతి కిరుప్రక్కల రెండు కొబ్బరిచెట్లున్నాయి. చిన్న తోటకూడా అందంగా, పొందికగా పెంచబడింది. దివ్యమైన ఔషధులమధ్య నిలుచున్న కైలాసంలాగా వుందా భవనం. వాసు దూరంనించి దాన్ని చూస్తూ సందేహంగా నిలబడిపోయాడు.

అసలు విషయమేమంటే, వాసు యింతవరకూ ఆయింటిలోనికి ప్రవేశించి వుండలేదు. కెప్టెన్ మోహనరావుగారి తత్వాన్ని గురించి వినివున్నవాడు కాబట్టి, ఆయన ఎదుట పడటంగాని, ఆయన నివసించే ప్రదేశాల పరిసరాల్లో వుండడంగాని క్షేమకరంగాదని తెలుసుకున్నాడు. అతడెప్పుడూ కెప్టెన్‌ని చూసివుండలేదు. కెప్టెన్ కూడా అతణ్ణి చూడకుండా జాగ్రత్త పడ్డాడు. అయితేనేం, అతని గురించి చాలానే విన్నాడు. కెప్టెన్ మోహన్‌రావు మిలటరీలో పనిచేసి రిటరయినవాడు పైగా కోపిష్టి అనికూడా వినికిడి. సుమారు ఏభై దగ్గర దగ్గరగా వయసున్నా, యిప్పటికీ పేరల్ల్ బార్, ఆసనాలూ, కసరత్తులూ క్రమం తప్పకుండా చేస్తుంటాడట. నెలకోసారి వేటకివెళ్లి వస్తుంటాడట. ఎవ్వరి సహాయమూ లేకుండానే ఆయన అరడజను పులుల్ని చంపారని కొందరంటారు మరికొందరు ఈ అభిప్రాయంతో ఏకీభవించరు. వాళ్లవుద్దేశంలో ఆయన స్వయానా చంపిన పులులు డజను పైచిలుకే.

వాసు మాత్రం యిదివరలో వసుంధరని ఎప్పుడు కలుసుకోవాలన్నా ఏ పార్కుకో, థియేటరుకో వెళ్లేవాడు. కాని అత్యవసర కార్యాలు ముంచుకొచ్చినప్పుడు ఆమె పార్కుకి

# చరకసంహిత

గానీ, థియేటరుకి గానీ వచ్చేంతవరకూ ఆగడానికి వీల్లేదు. అందుచేతనే ఒక చేతో జారిపోతున్న ధైర్యాన్ని చిక్కబట్టుకుని, మరొక'చేతో' నడిచి వచ్చాడు.

గాఢమైన ఒక నిట్టూర్పు విడచి, జాగ్రత్తగా ముందుకి నడిచాడు వాసు. ఆఫ్రికా అరణ్యాల్లో నడిచేవాళ్ల ఏకాగ్రత అతడి ధోరణిలో వ్యక్తమవుతూంది. పక్కనున్న ఏ పొద నుంచి అయినా పొంచివున్న పులి మీదికి దూకవచ్చు, కాలికింద అమాయికంగా కనిపించే గడ్డి చాటున నక్కివున్న విష సర్పం కాటేయ వచ్చునన్నట్టు అతి జాగరూకతతో ముందుకి నడిచాడు. గేటు దగ్గరికి వచ్చి లోనికి అటూ, యిటూ చూశాడు. పరిస్థితి ప్రశాంతంగానే వున్నట్టుంది. రేచుకుక్కలూ యితర భయంకర జంతువులూ అక్కడ విశృంఖలంగా తిరుగుతున్న జాడలు కనబడలేదు. వెంటనే ధైర్యం నిగ్గదీసుకుని. గేటు తెరిచి 'వసంతవనిలోనికి వెళ్లడానికి యిష్టంలేని వసంతుడిలా ముందుకి'నడిచాడు.

వరండా దగ్గరికి రాగానే వరసాగా అరడజను దాకా పులులు క్రూరంగా అతడికేసి చూస్తున్నట్టనిపించింది. పరకాయించి చూడగా అవి చంపిన పులుల బుర్రలని తేలింది. వరండా దగ్గరకొచ్చి మెట్టుమీద కాలూని "వసూ !" అని పిలవబోయాడు. కాని మాటలు వెలికి రాలేదు. దేహంలో ఏదో సహకార సంఘం వుంటుందని అతడు విన్నాడు. ఆ సహకార సంఘం యిప్పుడు అతడితో సహకరించడం లేదని అతడికి స్పష్టమయింది. మరొకసారి ప్రయత్నించి 'వసూ!' అన్నాడు. ఓ మోస్తరుగా సహకారం లభ్యమైంది.

కాని జవాబు లేదు.

గొంతు సర్దుకుని మరొకసారి "వసుంధరా !" అని పిలిచాడు. ఈసారి సహకార సంఘం బాగా పని చేస్తున్నట్టుంది. మంచి ఫలితాలే కనిపించాయి.

"ఎవరూ ?" అని లోపలినించి వీణ మీటినట్టున్న స్వరం వినవచ్చింది.

"వసూ !" అని మళ్లీ పిలిచాడు.

( ఇంకా వుంది )

## మినీ ఇంటర్వ్యూ

పత్రికలో మొదట ప్రశ్నావళి (అదే కె. రామ లక్ష్మిగారి జవాబులు) చదివి తరువాత కలిమ్మా ఫీచర్స్ గట్రా చూసే యస్. వి. వరప్రసాద్ యీ ఒక్కసారికి మ్మాత్రం తన మినీఇంటర్వ్యూ చదువుకుని ప్రశ్నావళి చదువుతాడని వేరే చెప్పాలా? కార్టూన్లు వేయాలన్న అభిలాషగల యీ అబ్బాయి కి బాపు అంటే ప్రీతి; లీనా నందవార్కర్ అతని అభిమాననటి.బి.కాం. విద్యార్థి. కామెడీ సినిమాలు చూస్తాడు. 'స్వర్గం నరకం'బావుందన్నాడు. ఇతనికి గారడీలు చాలా యిష్టం. వాటిమీద బుక్స్ సేకరించాడు. ఫ్రెండ్స్‌తో పేకాడతాడు. కాని యింకా అమ్మాయిలను ఏడిపించేటంతటి వయసు తనకి రాలేదంటున్నాడు. (1959 లో పుట్టాడట) వాళ్ల కాలేజీలో ప్లే గ్రౌండ్ వుంది కాని అవుట్ డోర్ గేములు ఆడను అన్నాడు వరప్రసాద్. క్రికెట్ ఆడాలంటే భయంకాని చూడటం, వినడం సరదా. లైబ్రరీలకు వెళ్తానినీ బి. కామ్. అయ్యాక సి. ఏ. చదవాలనుందని చెప్తున్నాడు వరప్రసాద్ గుడ్. ★★★



## అవీ — ఇవీ — అన్నీ

### 1857 విప్లవ వీరులు

రచన: శ్రీ తుర్లపాటి కుటుంబరావు. భారత మాత దాస్య శృంఖలాల విముక్తికి ఆ నాటి బ్రిటిషు సామ్రాజ్యవాదుల నెదిరించి యుద్ధరంగంలో వీరస్వర్గం పొందిన విప్లవ వీరులు ఝాన్సీ లక్ష్మీ బాయి, నానాసాహెబ్, జోరా పూర్ రాజు, తాంతియాతోపే, కున్వర్‌సింగ్, అహమ్మదుల్లాషా, శ్రీ రావు తులారామ్, బేగం హజరత్‌మహల్, రాజా భక్త్‌వర్‌సింగ్, రెండవ బహదూర్‌షా,హుకుంచంద్ జైన్, ఫిరోజుషాల జీవిత విశేషాలని, త్యాగనిరతిని పాఠకులు కన్నులకి కట్టినట్లు చిత్రీకరించారు రచయిత. 92 పేజీలు గల ఈ పుస్తకం వెల అయిదు రూపాయలు . ప్రతులకు: శ్రీ సుందర రామానుజ పబ్లికేషన్స్, లబ్బీపేట.విజయవాడ.10 ●

# వారఫలం

మహేష్

12-3-1976 శుక్రవారంమొదలు
18-3-1976 గురువారం వరకు

మేషం:— ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో ఇతరుల నిమిత్తం శ్రమకు గురికావలసి వస్తుంది. స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

వృషభం:— వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. మిత్రులకు సహాయంచేస్తారు. మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

మిధునం:— ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

కర్కాటకం:— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

సింహం :— చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో అనుకూలమైన పరిస్థితి ఏర్పడగలదు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లభించగలవు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

కన్య :— వ్యాపారంలో ఆదాయంబాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లభిస్తాయి. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యంబాగుండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

తుల:— ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో వ్యతిరేకమైన మార్పులు రాగలవు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

వృశ్చికం:— రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిసాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

ధనుస్సు :— మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వృత్తిలో శ్రమకలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో ప్రయాస కలుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

మకరం:— మీ ఆలోచనలు ఫలిస్తాయి.







గ్రంథాలయాలకు పుస్తకములు ఎన్నిక చేసుకునే సందర్భంలో
పాఠకుల అభిమానాన్ని అపారంగా చూరగొన్న
నవభారత్ ప్రచురణలను మరువకండి!

# * నవభారత్ బుక్ హౌస్

ఏలూరు రోడ్, PHONE 77578
విజయవాడ-PIN:520002.

## తెలుగునాట పఠనాసక్తిని పెంచిన ప్రసిద్ధ నవలలు

### యద్దనపూడి సులోచనారాణి రచనలు :

| | | | |
|---|---|---|---|
| జీవన తరంగాలు మొ. భా. | 10-00 | రాధాకృష్ణ కథ | 12-50 |
| జీవన తరంగాలు రెం. భా. | 10-00 | బంది | 7-50 |
| మీనా (మొదటి భాగం) | 7-50 | ఆశల శిఖరాలు | 7-50 |
| మీనా (రెండవ భాగం) | 7-50 | బంగారు కలలు | 7-50 |
| సెక్రటరీ | 7-50 | బహుమతి | 6-00 |
| విజేత | 7-50 | సంయుక్త | 6-00 |
| ఆహుతి | 10-00 | నేను రచయిత్రిని కాను | 6-00 |
| ఆంధ్ర యువకులారా దారి ఇటు | 6-00 | జ్యోతి | 6-00 |

### మాదిరెడ్డి సులోచన రచనలు :

| | | | |
|---|---|---|---|
| శృతితప్పిన యుగళగీతి | 6-00 | ఆశయాల ఆఖరిమెట్టు | 6-00 |
| అభినేత్రి | 6-00 | సంసార నౌక | 6-00 |
| నిరీక్షణ | 6-00 | భిన్నధృవాలు | 6-00 |
| గోతోపాటు సల్లగటం | 6-00 | సంధ్య | 6-00 |
| నాగమల్లికలు | 6-00 | పంతులమ్మ | 6-00 |
| అగ్నిపరీక్ష | 6-00 | గడ్డితినే మనుషులు | 6-00 |
| శ్రీనిలయం | 6-00 | తరం మారింది | 6-00 |
| ప్రేమలు - పెళ్ళిళ్ళు | 6-00 | జననీ జన్మభూమి | 6-00 |
| అద్దాలమేడ | 6-00 | మనిషి-మతము | 6-00 |
| లంగరు వేసిన జీవితాలు | 6-00 | న్యాయం నిదురపోయింది | 7-50 |
| అక్కయ్య చెప్పిన కథలు | 6-00 | అధికారులు ఆశ్రితజనులు | 7-50 |
| పూల మనసులు | 7-50 | జీవనయాత్ర | 8-00 |
| చెప్పుడిచ్చిన వరాలు | 7-50 | | |

### కె. రామలక్ష్మి రచనలు :

| | | | |
|---|---|---|---|
| ఆడది | 6-00 | ప్రేమించు ప్రేమకై | 6-00 |
| ఎవరో మనిషి | 6-00 | కరుణ కథ | 5-00 |
| ఆశకు సంకెళ్ళు | 6-00 | లవంగి | 6-00 |
| చీకటి దారి | 6-00 | అందుకో ఈ ప్రేమలేఖ | 6-00 |

### బీనాదేవి రచనలు :

| | |
|---|---|
| పుణ్యభూమీ! కళ్ళు తెరూ! | 10-00 |
| ఫస్ట్ కేస్ | 6-00 |
| రాధమ్మ పెళ్లి ఆగిపోయింది | 6-00 |
| డబ్బు! డబ్బు!! డబ్బు!!! | 6-00 |
| ఏ మేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్ | 6-00 |

### మీ అభిమాన రచయితల రచనలు :

| | | |
|---|---|---|
| ఆనంద భైరవి | —పురాణం సీత | 6-00 |
| ముగ్గురు అమ్మాయిలు | ” | 6-00 |
| హిమజ్వాల | —వడ్డెర చండీదాస్ | 15-00 |
| ఒకే రక్తం ఒకే మనుషులు | —కొమ్మూరి వేణుగోపాలరావు | 6-00 |
| రాగ విపంచి | —శ్రీధర | 7-50 |
| వయస్సు — వెల్లువలు | —నేమలికంటి రామచంద్రరావు | 10-00 |

నవలా సాహిత్యంలో కొత్త మార్పుకు

## "నవలా ప్రియదర్శిని"

సాహితీ పథకాన్ని ప్రోత్సహించండి!

—:o:—

### విజయవంతమైన మొదటి పోటీ నవలలు

| | | |
|---|---|---|
| లీలా మనోహరం | — మల్లాది సూరిబాబు | 5-00 |
| వెన్నెలమెట్లు | —వై. రామలక్ష్మి | 6-00 |
| కొత్త చిగురు | —వి. రాజా రామమోహనరావు | 5-00 |
| మ్రోడి నీడ | —ప. సత్యవతి | 5-00 |

### రెండవ పోటీ నవలలు

### ముగింపు తేదీ **30-6-76**

| | | |
|---|---|---|
| హాలాహలంలో అమృతం | —కొలిపాక రమామణి | 5-00 |
| మంచు పల్లకీ | —వంశీ | 5-00 |
| పుల్లి | —అరేటి నాగమణి | 5-00 |
| రేపటి కొడుకు | —మల్లాది వెంకటకృష్ణమూర్తి | 6-00 |
| మృదుల | —జయశ్రీ ఉండవల్లి | 5-00 |
| కాంతా కనకాలు | —పురాణం సూర్యప్రకాశరావు | 5-00 |

—:o:—

### మా నూతన ప్రచురణలు

| | | |
|---|---|---|
| సెక్స్-సైన్స్ | — డా. జి. సమరం | 7-50 |
| జీవితం ఏమిటి | — కకుభ | 12-50 |
| శ్రావణసంధ్య | —వాశ్యూరి నాగేశ్వరరావు | 6-00 |
| చీకటిలో చీలికలు | — గొల్లపూడి మారుతిరావు | 10-00 |

**పై పుస్తకములు మీ అందుబాటులో వున్న పుస్తక విక్రేతలనుండి గాని మాకుగాని వ్రాసి పొందండి**

లోకం పోకడ — డామెన్













## వారఫలం

వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో, నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధి సాధిస్తారు.

కుంభం :— మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. రావలసిన డబ్బు అందుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రాగలదు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

మీనం :— వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాల లాభిస్తాయి.. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. ఇతరుల నిమిత్తం ప్రయాసకు గురికాగలరు ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ●



'రిపబ్లిక్‌డే' నాడు బందరు కలెక్టర్ ఆఫీసులో
నృత్య ప్రదర్శన ఇచ్చిన కుమారి పానుగంటి పద్మ
...డ వ్యాస్తి కూచిపూడి నృత్య ప్రదర్శనలు ఇచ్చి
పెద్దల ప్రశంసలు బహుమతులు కూడా చూర

Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street.

